# ఆంధ్రపత్రిక

317618




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No 259 THURSDAY 22nd DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# సంక్రాంతి కానుకగా ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్ర బహూకరణ

## జనవరి 26 లోపునే ఆంధ్రరాష్ట్రం ఏర్పడగలదని కళా వెంకట్రావుగారి ప్రకటన

### ఆర్థిక ఉపసంఘ నివేదికపై విభజనసంఘ చర్చ: కార్యక్రమాన్ని శీఘ్రంగా ముగించుటకు ప్రయత్నం

### ఢిల్లీ అభిప్రాయంగురించి విభజన సంఘానికి శ్రీ వెంకట్రావు, కృష్ణమాచారిగార్ల నివేదన

### నాలుగురోజుల్లో విభజనసంఘకార్యక్రమం ముగిసేసూచన

చెన్నపట్నం, డిసెంబరు 21: చెన్నరాష్ట్ర విభజన సంఘ సమావేశం నేటిఉదయం 8 30 గం.లు మొదలు 9-45 వరకు మంత్రివర్గమందిరమున జరిగెను. ఆర్థికోపసంఘం వారు తమనివేదికను విభజన సంఘమునకు సమర్పించిరి. ఉదయము సమావేశము ముగిసినపిమ్మట విభజనసంఘం వారు మధ్యాహ్నం 2-30 గంటలకు తిరిగి చర్చలకు ఉపక్రమించిరి.

జనవరి 26 వ తేదీనే ఆంధ్రరాష్ట్రం రాగలదనీ, ఢిల్లీలో ఈ విషయమై తాము మాట్లాడివచ్చితిమనియు, మద్రాసు ప్రభుత్వము వారు ఆ ప్రకారముగానే తమ సన్నాహములను సాగించవలసినదనియు నేటివిభజనసంఘంలో శ్రీ వెంకట్రావు, కృష్ణమాచారిగారలు తెలిపినట్లు తెలియుచున్నది. విభజనసంఘ సభ్యులైన కళా వెంకట్రావు టి. టి. కృష్ణమాచారిగారలు ఢిల్లీనుంచి విమానములో నేటిఉదయం మద్రాసు చేరి".

## ఇండోచైనా ఆక్రమణకు మావ్ సన్నాహం?

### మాస్కో ప్రయాణ అంతరార్థం

లండన్, డిసెంబర్ 21: చైనా కమ్యూనిస్టునాయకుడు మావ్ సేటుంగ్ మాస్కోకు వెళ్లింది ఇండోచైనానూ, ఆపై దేశాలనూ ఆక్రమించే విషయమై మార్షల్ స్టాలిన్‌తో సంప్రదించటానికేనని ఇక్కడకు వాషింగ్టన్‌నుంచి వస్తున్న వార్తలు తెలుపుతున్నవి. కమ్యూనిస్టు సేనలు ఫార్మోజాను వదిలి దక్షిణయాత్ర మొదలు పెట్టవచ్చునని ఇక్కడ భావించబడుతున్నది.

రాబోయే నెలలలో ఇండోచైనా, బర్మా, మలయాలకు ప్రమాదం అతిశయించగల దనటానికి ఏమాత్రం సందేహమూలేదని వాషింగ్టన్‌లోని ఉన్నతాధికార వర్గాలు అన్నారని తెలుస్తున్నది.

మంచూరియా దాదాపు పూర్తిగా సోవియట్ అజమాయిషీలో ఉన్న విషయమై స్టాలిన్ - మావ్ సేటుంగ్‌లకు స్పర్థలు ఏర్పడినట్లుగా కొందరు పరిశీలకులు భావిస్తున్నారు. (గ్లోబ్)

## వియట్నాం సరిహద్దుల్లో చైనా కమ్యూనిస్టు సైన్యం

పారిస్, డిసెంబర్ 20. చైనాసముద్ర తీరంలోఉన్న మంకే రేవుపట్టణం దగ్గర నుంచి 80-మైళ్లు పడమరగా లాంగ్‌సో పట్టణంవరకూ చైనా-వియట్నాం సరిహద్దుల వెంబడి చైనాకమ్యూనిస్టుసేనలు నేడుబారులు తీర్చి సంధించినవని ఫ్రాన్స్‌ప్రెస్ ఏజన్సీ తెలుపుతున్నది

## ఫ్రెంచి సామ్రాజ్య వాదాన్ని తుదివరకూ ప్రతిఘటిస్తాము

### ఇండోచైనాస్వాతంత్ర్యసమరవార్షికోత్సవం: డా॥ హోషిమిన్ హెచ్చరిక

సైగాన్, డిసెంబర్ 20: "వియట్నాంలో ఫ్రెంచి సైనికుడు ఒక్కడుకూడా లేకుండా పోయేవరకూ, వియట్నాంకు నిజమైన స్వాతంత్ర్యం, జాతీయైక్యత వచ్చేవరకూ మేము పోరాడుతాము. ఫ్రాన్స్ అంతర్జాతీయ సహకారాన్ని తనకుతోడుగా తెచ్చుకొనటానికి ప్రయత్నిస్తున్నది కాని, ప్రపంచ ప్రజాస్వామిక శక్తుల పురోగమనం మా విజయానికి తోడ్పడుతుంది." అని వియట్నాం ప్రతిఘటనోద్యమ నాయకుడు డా॥ హోషిమిన్ నేడు వియట్మిన్ రేడియోలో ప్రసంగిస్తూ ఉద్ఘాటించాడు.

హానోయ్‌మీద ఫ్రెంచివారు దండయాత్ర జరిపిన సంఘటన నేటికి [illegible] యింది.

"ప్రజాస్వామిక శక్తుల పురోగమనానికి ముఖ్య నిదర్శనం చైనా ప్రజాస్వామిక సేనల అఖండ విజయమే" అని హోషిమిన్ వివరించాడు. "వియట్నాం ప్రజలు స్వాతంత్ర్యంకొరకు ఎక్కడైనా పోరాడటానికి సిద్ధంగా ఉన్నారు. ఫ్రెంచి ప్రజలతో సహకరించటానికి వారు సిద్ధంగా ఉన్నారు. కాని తిరిగి బానిసత్వానికి అంగీకరించటం మాత్రంకల్ల" అని [illegible] హెచ్చరించాడు.

వియట్మిన్ సర్వసేనాని కమ్యూనిస్టు అయిన జనరల్ [illegible]

(5-వ పేజీ చూడుడు)

## అస్సాం రాష్ట్రంలో జాగ్రత చర్యలు

న్యూఢిల్లీ, డిసెంబరు 20: ఇటీవల చైనాలోవచ్చిన మార్పులను దృష్టిలోవుంచుకొని, అస్సాంరాష్ట్రంలో అవసరమైన చర్యలు తీసుకోబడుతున్నాయని సర్దార్ పటేల్, ఈవేళ పార్లమెంటులో తెలియజేశారు.

## 'జనవరి 26 న ఆంధ్రరాష్ట్రం'

### కళా వెంకట్రావు ప్రకటన

చెన్నరాష్ట్ర విభజన సంఘసభ్యులైన అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావు టి. టి. కృష్ణమాచారిగారలు భారత నాయకులను ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సందర్భమున దర్శించి నేటి ఉదయం విమానంలో మద్రాసుచేరిరి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారిని ఆంధ్రపత్రిక ప్రతినిధి సందర్శించి వారి రాయబారము ఫలించినదా అనియు, జనవరి 26 కు ఆంధ్రరాష్ట్రం రాగలదా అనియు అడుగగా జనవరి 26 వ తేదీకే రాగలదని తను విశ్వాసమనియు, కేంద్రప్రభుత్వ హోంశాఖవారి లేఖ ఎటులఉన్ననూ జనవరి 26 కే రాగలదని తాము విశ్వసించుచున్నామనిరి. ఇక్కడి కార్యకలాపాలను సత్వరమే ముగించివేయదలచినామనికూడా తెలిపిరి. రెండుకోట్లలోటు అంతగా చెప్పదగినది కాదనిరి.

(4-వ పేజీ చూడుడు)

## కాశ్మీర్ సమస్యపై ఇండియా పాకిస్థానలతో సంప్రతింపులు క్రిస్మస్ లోపుగాపూర్తికాగలవనిమెక్‌నాటన్

లేక్‌సక్సెస్, డిసెంబరు 20: కాశ్మీర్ సమస్యాపరిష్కారానికై ఇండియా, పాకిస్థాన్ ప్రతినిధులతో తాను సాగిస్తున్న సంప్రదింపులు క్రిస్మస్ పండుగలోపుగా పూర్తికావచ్చునని భద్రతామండలికి ఈ నెలలో అధ్యక్షుడూ, కెనడా ప్రతినిధి అయిన జనరల్ మెక్‌నాటన్ నేడిక్కడ సూచించాడు.

క్రిస్మస్ సెలవులు మొదలయ్యేముందే ఒక పరిష్కారానికి రాటానికి వీలున్నదని భావిస్తున్నారా? అని అడగ్గా 5 [illegible] ఏమయినా జరగవచ్చు [illegible] తాను [illegible] ఉన్నదీ, ఏమిమాట్లాడుతున్నదీ తెలియజేయటానికి అతడు నిరాకరించాడు.

జనవరి ఒకటవ తేదీతో తన అధ్యక్షపదవీ, భద్రతామండలిలో కెనడా సభ్యత్వమూ ముగిసిపోగలవు. కనుక క్రిస్మస్ లోపుగానే తుదిప్రయత్నం చేయాలని అతడు ప్రయత్నిస్తున్నాడు కాని అవసరమయితే అధ్యక్షునిహోదా లేకపోయినప్పటికీ వ్యక్తిగతంగా సంప్రదింపులను కొనసాగించవలసినదిగా భద్రతామండలి అతనిని కోరవచ్చునని కూడ ఇక్కడ భావించబడుతున్నది

ఈ విషయమై అడ్గగా మెక్‌నాటన్ జవాబివ్వలేదు

కానీ కేళ మధ్యవర్తి సంఘ సభ్యులను [illegible] అతడు [illegible] నాడు

## జనవరి 24-న భారత రిపబ్లిక్ అధ్యక్షుని ఎన్నిక

న్యూఢిల్లీ, డిసెంబరు 20: భారత రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షుని ఎన్నికను రాజ్యాంగపరిషత్తు 1950, జనవరి 24-వ తేదీన జరుపుతుందని నేడు అధికారప్రకటన వెలువడింది.

రాజ్యాంగ పరిషత్తు కార్యాలయం నుండి నేడు వెలువడిన ప్రకటన ఈవిధంగా వున్నది:

"రాజ్యాంగపరిషత్తు అధ్యక్షుడు పరిషత్ సమావేశాన్ని జనవరి 24-న ఏర్పాటు చేశారు. ఆరోజు జరిగే కార్యక్రమంలో భారత రిపబ్లిక్ అధ్యక్షుని ఎన్నిక ఒకటి."

## జపాన్‌లో అమెరికా తతంగం

### రష్యా ఆరోపణ

టోకియో, డిసెంబరు 21: జపానులోనున్న మిత్రరాజ్యాల వ్యవహారాల సలహాసమావేశములోనుండి నేడు రష్యా ప్రతినిధి అధిక్షేపణార్థముగా వెడలిపోయెను. రష్యాను ప్రతిఘటించిపోరాడుటకై పశ్చిమవర్గ రాజ్యాలతరపున జపాను ప్రజలను చేర్చుకొని వారిని ఆయుద్ధంలో ఫిరంగులకు ఆహుతిచేయవలెనని అమెరికా ప్రభుత్వము ఉద్దేశించుచున్నదని నేటిసమావేశంలో అమెరికాను నిందించి రష్యాప్రతినిధులు సభలోనుండి వెడలిపోయిరి.

## తూర్పుపాకిస్థాన్‌కుసంపూర్ణ స్వాతంత్ర్యం కావాలి

### తూ. బెం. ముస్లింలీగుసభతీర్మానం

ఢక్కా, డిసెంబరు 20: తూర్పు పాకిస్తాను ముస్లింలీగు పార్లమెంటరీ పార్టీ నిన్న సమావేశమై తూర్పుపాకిస్తానుకు (అనగా తూర్పు బెంగాలుకు) సర్వస్వతంత్ర పరిపాలనాధికారము ఉండవలెననియు, విదేశ వ్యవహారములలోను, సైనిక వ్యవహారములలోను మాత్రము పాకిస్తాను కేంద్రప్రభుత్వము అధికారము కలిగి యుండవలెననియు తీర్మానించెను.

పాకిస్తానుకు నూతన రాజ్యాంగచట్టము తయారు కావలసియున్నది. తూర్పు పాకిస్తానుయొక్క సైనికరక్షణ విషయంలోను, విదేశాంగ వ్యవహారాలలోను తప్ప తదితర వ్యవహారశాఖ లన్నింటియందును తూర్పు పాకిస్తాను సర్వస్వతంత్రమైన రాష్ట్రమై ఉండునట్లుగా క్రొత్త రాజ్యాంగచట్టమునందలి కేంద్ర శాసనసభయందు తగినంత ప్రాతినిధ్యము జనసంఖ్యా ప్రమాణము ననుసరించి తూర్పు పాకిస్తానుకు ప్రాతినిధ్య ముండవలెనని యీ సమావేశములో తీర్మానింపబడెను

కేంద్రప్రభుత్వపక్షమునకు తూర్పు పాకిస్తాను చాలాదూరముగా విడివడి యుండుటవల్ల యిట్టి సర్వస్వతంత్రాధికారము తూర్పు పాకిస్తానుకు ఉండవలెనని తీర్మానింపబడెను. రాజ్యాంగ పరిషత్తులో తూర్పు పాకిస్తానుకు తగినంత ప్రాతినిధ్యం లేదు గనుక ఇప్పుడున్న సభ్యత్వ ఖాళీలయందు తూర్పు బెంగాలు ప్రతినిధులను ఎన్నుకొనుటకు అవకాశమీయవలెనని మరొక తీర్మానం చేయబడెను.

## గుంటకల్లు మునిసిపాలిటి

పై మునిసిపాలిటీ ఎన్నికకు నామినేషనులు డిశంబరు 27, స్క్రూటినీ-30, ఉపసంహరణ [illegible] ప్రకటించుట జనవరి 6, అప్పీలు-12. పోలింగు జన-27, ఓట్లు లెక్కించుట జన 28 తేదీలు నిర్ణయింపబడెను

## కృష్ణా జిల్లాలో తుపాను బాధితులకు రు. 99,000 లు

మదరాసు ప్రభుత్వం వారు కృష్ణా జిల్లాలో తుపాను బాధితుల సహాయానికి యింకో రూ 99,000 మంజూరు చేసిరి.

## "కర్నాటకుల బెదిరింపులు కాంగ్రెస్ క్రమశిక్షణకు విరుద్ధం"

### కాంగ్రెస్ కార్యవర్గ విస్పష్ట ప్రకటన

### "అనేక చిక్కులతో కూడిన ప్రత్యేక కర్నాటక రాష్ట్ర నిర్మాణం ఇప్పుడు అసంభవం"

న్యూఢిల్లీ, డిసెంబర్ 21: "కర్నాటకరాష్ట్ర స్థాపనకు లోగడ సూచించిన షరతులన్నీ సక్రమంగా నెరవేరనిదే, కర్నాటకరాష్ట్ర విభజన అనేది అసంభవకార్యం. 5 వారాలలోపల క్రొత్తరాజ్యాంగం అమల్లోకివస్తూ, భారతదేశానికంతకూ గంభీర పరిణామంరాబోతున్న ఈ తరుణంలో, రాజ్యాంగ విషయికంగా ఇంత ప్రధానమైన సమస్యను ఇప్పుడు చేపట్టి ఆలోచించే సావకాశం లేదు. కర్నాటక రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల రాజీనామాల బెదిరింపులు కాంగ్రెస్ క్రమశిక్షణకు వ్యతిరేకంగానూ అసంగతంగానూ వున్నవి." అని కాంగ్రెస్ కార్యవర్గం ఈవేళ జరిగిన సమావేశంలో స్పష్టంగా ఒక తీర్మానం చేసింది:

ఈసమావేశానికి రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్యగారు, ప్రధాని నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా అజాద్, శంకరరావు దేవ్, ప్రొఫెసర్ యన్ జి. రంగా, నిజలింగప్ప మొదలైన ప్రముఖులంతా హాజరైనారు.

అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గం ఈ వేళ సమావేశమై, కర్నాటక రాష్ట్ర కాంగ్రెసువారు చేసిన తీర్మానాలను 2 గం పాటు చర్చించి 2 ప్రధానమైన తీర్మానాలు చేశారు. ఈతీర్మానాల అనంతరం కార్యవర్గసమావేశాన్ని జనవరి 17 తేదీకి తిరిగి వాయిదా వేశారు. ఈసమావేశానికి రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షత వహించారు.

### తీర్మానాల పూర్తిపాఠం

1 కర్నాటక రాష్ట్రవిభజనను గురించి కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు సంఘమున్నూ రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గమున్నూ చేసిన తీర్మానములు విచారించటమైనది ప్రస్తుతమున్న రాష్ట్రముల విభజన జరుగవలెనన్నా, క్రొత్త రాష్ట్రములను యేర్పరచవలెనన్నా యే యే షరతులకు లోబడి అట్టి కార్యక్రమము జరుగవలెనో అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గం లోగడ సూచించి వున్నది తమకు ప్రత్యేక రాష్ట్రం వుండవలెనని కర్నాటక ప్రజలకు గల చిర వాంఛితమును కార్యవర్గము గమనించియే యున్నది. ఆ యభిలాషయందు గల శేచిత్యమును సహితము అంగీకరించుచున్నది కాని కార్యవర్గం లోగడ నిరూపించిన షరతులు నెరవేరు వరకూ అట్టి రాష్ట్రమేదీ యేర్పడుటఅసంభవము ముఖ్యముగా కర్నాటక రాష్ట్ర విషయంలో మైసూరు యొక్క భవిష్యత్తు తేలవలసి వున్నది. దీనివలన రాజ్యాంగ విషయికమైన అనేక సమస్యలు బయలుదేరగలవు. ప్రజా బాహుళ్యము యొక్క సంపూర్ణ ఆమోదము లేనిది అట్టి సమస్యలను పరిష్కరించ గలుగుట అసంభవము కాగలదు. అదియునూగాక, ఒకటి రెండు వారముల అనతి కాలములో నూతన భారత రాజ్యాంగము అమలులోకి వచ్చుటా, తద్వారా భారత దేశమున కంతకూ ఒక గంభీర పరిణామమువచ్చుట జరుగనున్నది. ఇట్టి పరిణామ దశలో, రాజ్యాంగ విషయికంగా యింత తీవ్రమైన మార్పును చేయు విషయమై యిప్పుడు చేపట్టి ఆలోచించుటకు ఇప్పుడు సావకాశం లేదు. అందుకు ఇది సరియైన అదను కాదు.

2. రాష్ట్రశాసన సభలనుంచి కర్నాటక ప్రతినిధులంతా రాజీనామాలు చేయవలెనని సూచించుచూ, కర్నాటక కాంగ్రెస్

(6 వ పేజీ చూడుడు)

## "చైనానుగాని ఏ ఇతర ఆసియా రాజ్యాన్నిగానిఅమెరికాజారవిడవదు"

### అమెరికన్ రాయబారి ఫిలిప్ జేసప్‌ప్రకటన

శాన్‌ఫ్రాన్సిస్కో, డిసెంబరు 20: "చైనానుగాని, ఇంకా ఏ ఇతర ఆసియా రాజ్యాన్నిగాని అమెరికా జారవిడుస్తుందన్న అనుమానం ఎవరు పెట్టుకోనవసరం లేదు." అని అమెరికా దేశాంతర రాయబారి ఫిలిప్ జెస్సప్ నేడిచ్చటవెల్లడిచేశారు.

ప్రపంచ వ్యవహార వ్యవస్థవారు ఏర్పాటుచేసిన సమావేశంలో మాట్లాడుతూ తాను అమెరికాకమ్యూనిస్టుచైనాను గుర్తిస్తుందా? గుర్తించదా అన్న విషయాన్ని చెప్పడానికి వీల్లేదని, విదేశాంగ శాఖవారు తమ విధానాన్ని ప్రకటించి ఆవిషయాన్నిగూర్చి మాట్లాడటం అసంగతంగా వుంటుందని ఆయన అన్నారు.

కమ్యూనిస్టు సిద్ధాంతాలకు మనం పూర్తిగా వ్యతిరేకులం దేశంలో అధికారంలోవున్న ప్రభుత్వాన్ని బలవంతంగా విప్లవాలతో పడగొట్టటం మనం సహించలేము. బయటివారి ప్రమేయంలేకుండా ప్రజలు తమకు తోచిన ప్రభుత్వాన్ని నిర్మించుకుంటే కాదనేవాళ్లు ఎవరూ లేరు. పైగా అటువంటి ఏర్పాటును మనమంతా హర్షిస్తా.

# రాజమండ్రి కాగితపు మిల్లు

## ప్రభుత్వ నిర్వహణగురించి అసెంబ్లీలో ప్రశ్నలు

మదరాసు, డిసెంబరు 20 : రాజమహేంద్రవరంలోని కాగితపు మిల్లు పని చేయుచున్నదని లేబరు మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు నేడు అసెంబ్లీలో తెలిపిరి.

గోదావరినీరు తేరుకోగానే ఈ నెలాఖరుకు మిల్లులో ఉత్పత్తి పూర్తిగ జరుగగలదని అనుబంధ ప్రశ్నకు మంత్రిగారు జవాబు ఇచ్చిరి.

రజాఖాన్ ప్రశ్నకు జవాబుఇచ్చుచూ రోజుకు 10 టన్నులు వుత్పత్తి కావలెననియు అయితే ఇప్పుడు 2 పంతులలో 4 టన్నులమాత్రమే వుత్పత్తి అవుతున్నదనిరి.

మిల్లు గిట్టుబాటు కావలెనన్న మూడు షిఫ్టులు పనిచేసి ఉత్పత్తి పూర్తిగ జరుగవలెనుగదాయని శ్రీ పైండా వెంకటనారాయణ గారడిగిరి.

నిజమే. గోదావరి తేరుకోగానేపూర్తి ఉత్పత్తి ప్రారంభము కాగలదని మంత్రి గారనిరి.

ఉపప్రశ్నలకు సమాధాన మిచ్చుచూ ప్రభుత్వము మిల్లును రు 25 లక్షలకు కొన్నదనియు, నిపుణులు లాభము రాగలదని ప్రభుత్వమే నిర్వహించవలెనని సలహా ఇచ్చిరనికూడ తెలిపిరి.

ఉత్పత్తికి కావలసిన ముడిసరుకు కావలసినంత లభించగలదనికూడ మంత్రిగారు తెలిపిరి.

శ్రీ లింగరాజుగారు మిల్లుకు ఒక కాగితపు నిపుణుడు వుండుట అవసరముగదా యనగా ఒకరిని నియమించుటకు ఆలోచించితిమి. ఇండియా ప్రభుత్వము జర్మనీ నుండి ఒకరిని తెప్పించెదమనిరి కానిఎందు వలనో రాలేదని మంత్రిగారనిరి.

ఈనెలాఖరుకు మిల్లులో రోజుకు 10 టన్నుల ఉత్పత్తి అవుతుందని శ్రీ గుంటూరు నరసింహారావు ప్రశ్నకి జవాబు ఇచ్చిరి.

# సాందూర్ రాజుకు భరణం

## అసెంబ్లీలో ప్రశ్నలు

మదరాసు, డిశంబర్ 20: సాందూరు రాజుకు సం॥మునకు రు. 90,000/-లు భరణము నిర్ణయించబడినదని సభానాయకులు శ్రీ గోపాలరెడ్డిగారు నేడు అసెంబ్లీలో శ్రీ పి. వి. సుబ్బయ్యగారికి తెలిపిరి.

సంస్థాన ఆదాయముల సగటును బట్టి కేంద్రప్రభుత్వము భరణము నిర్ణయించి యుండవచ్చుననియు, 1946-47 లో బనగానపల్లి ఆదాయం రు. 5,62,897-4-0, 1947-48 లో సాందూరు ఆదాయం రు. 80,136/-అని కూడ సమాధానములో తెలిపిరి.

శ్రీ సుబ్బయ్య : ఇదిగాక వెల్లిస్సు, ఇల్లు కట్టుకొనుటకు రొక్కమేమైనా యిచ్చినారా?

స : బనగానపల్లి వారికి ఇటువంటివానికి కొంత ఇవ్వవలెనని ఇండియా ప్రభుత్వమునకు శిఫార్సు చేసితిమి.

శ్రీ కాశేశ్వరరావు : ప్రతి సంవత్సరం వేలకొలది ఆదాయంవచ్చే కొత్త పెట్టుబడిదార్లను సృష్టించుట మంచిది కాదేమో?

స : ఇండియా ప్రభుత్వము సంస్థానములను వశపరచుకున్నప్పుడు వారికి ఉదారముగా పరిహారమిచ్చుట న్యాయమని భావించి యుండవచ్చును

ప్ర : ఈ భరణము వంశపారంపర్యా వుండునా?

స : కొంతకాలము వుంటుంది. బహుశః వ్యక్తితో అంతమయ్యేది కాదేమో.

శ్రీ నివర్తి : భరణమేగాక మరికొన్ని మొత్తములు చెల్లించినమాట వాస్తవమేనా?

స : ప్రత్యేకంగా ప్రశ్న వేయవలెను.

ప్ర : సంస్థానములు రాష్ట్రములో కలిసిన తరువాత ప్రజలభాగ్యము వృద్ధి అయినదా?

స : ప్రజలభాగ్యము అభివృద్ధివిషయం వేరు.

శ్రీ సుబ్బయ్య : రాష్ట్రములో కలిసిన తరువాత సంస్థాన ప్రజలు నిరంకుశ ప్రభుపాలన విముక్తిపొందినామని సంతోషించుచున్నారుగదా?

స్వ : స్వతంత్ర భారతదేశములో భారత ప్రజలమని అనుకుంటున్నారు.

శ్రీ కాశేశ్వరరావు : సంస్థానములో స్వతంత్ర భారత ప్రాంతములకన్న పన్నులు ఎక్కువగదా?

స: కొన్ని ఎక్కువగానున్నవి కొన్ని తక్కువగానున్నవి. సంస్థానములు రాష్ట్రములో విలీనమైన తరువాత ... పన్ను అధికముగా వేయబడెను.

శ్రీ సుబ్బయ్య : భరణ మొత్తం రాష్ట్ర ప్రభుత్వముతో సంప్రదించే కేంద్రము నిర్ణయించినదా?

స: భరణము నిర్ణయించుటకు వారికొక పద్ధతి యున్నది.

# కాంగ్రెసు సభ్యులను చేర్పుటలో దుర్నీతి

## రంగా, నెహ్రూ ప్రభృతులకు కాశేశ్వరరావుగారి తంతి

విజయవాడ, డిసెంబర్ 19: కాంగ్రెసులో సభ్యులను చేర్పించటాన్ని వెంటనే ఆపుచేయించాలని కోరుతూ అయ్యదేవర కాశేశ్వరరావుగారు ఎన్. జి. రంగా, సర్దార్ పటేల్, పండిట్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్ గార్లకు తంతి పంపించారు. అయోగ్యులైన వ్యక్తులను అర్హ సభ్యులుగా చేర్పించటం, స్వార్థప్రయోజనాపరులు అర్హ సభ్యచందాలను తామే భరించి వారిని చేర్పించటం జరుగుతున్నదని, ఇది ఇంకా కొనసాగితే కాంగ్రెసు తన గోతిని తానే త్రవ్వుకున్నట్టు కాగలదని ఆయన హెచ్చరిక చేశారు. స్వ. వి.

# నాటక కళోద్ధరణ సంఘం రాయలసీమ

బళ్లారి, డిసెంబరు 18 : మద్రాసు ప్రభుత్వముచే నియమితమైన నాటక కళోద్ధరణ సంఘ సభ్యులగు ఉయ్యూరు కుమార రాజా, యస్. జె. ఆచార్య, గిడుగు సీతాపతి గారలు, నిన్న గుంతకల్లు, బళ్లారిలలో పర్యటించి నేడు కడప వెళ్లిరి. గుంతకల్లు రైల్వే ఇన్‌స్టిట్యూట్‌లో లలిత కళా సంఘము వారిచేతను, ఇన్‌స్టిట్యూట్ వారిచేతను చాచా ప్రదర్శనము నిన్న రాత్రి జరిగెను. డా॥ కె. వి. గోవిందరాజులు, సత్యసాధన్, నాగశేషునం, శ్రీమతి నాగరత్నం గార్లు ప్రధాన భూమికలను గైకొనిరి. బళ్ళారి కుమారి ఇంద్రాణి దేవి కుమారి శాంతి (గుంతకల్లు) నృత్యము చేసిరి. ప్రదర్శనానంతరము సీతాపతిగారుపాత్రధారులనుప్రశంసించిరి.

డా॥ సత్యసాధన్, రాజగోపాలుగార్ల వందనలతో గుంతకల్లు కార్యక్రమము ముగిసెను. (స్వ. వి.)

# గుంటూరుజిల్లా పత్రికా రచయితల సంఘ సర్వసభ్యసమావేశము

తెనాలి, డిసెంబర్ 17: గుంటూరు జిల్లా పత్రికా రచయితల సంఘ సర్వసభ్య సమావేశము ఇక్కడ ఆవుల గోపాలకృష్ణమూర్తిగారి అధ్యక్షతను జరిగినది. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు కవి బ్రహ్మ ఏటుకూరి వెంకట నర్సయ్యగార్ల మరణమునకు తమ సంతాపమును తెలియజేయుచూ తీర్మానించిన తరువాత ఆంధ్ర సంపాదన విషయంలో ఆంధ్ర నాయకులందరు అయిక్యత చూపినందులకు వారిని అభినందించుచూ జనవరి 26 వ తేది నాటికి ఆంధ్రరాష్ట్రము ఏర్పడునట్లు చేయవలసినదిగా కేంద్రరాష్ట్ర ప్రభుత్వములను కోరుచూ తీర్మానించారు. తరువాత జిల్లా పత్రికా 6 వ మహాసభ కోలవెన్ను రామకోటేశ్వరరావు గారి అధ్యక్షతను వచ్చే జనవరి 8 వ తేదిన వేటపాలెంలో జరుపుటకు తీర్మానించారు. ఈ సందర్భములో వేమూరి నాగయ్యగారిని ఆహ్వానించుటకు కూడా తీర్మానించారు. (స్వ. వి.)

# రాజకీయ బాధితులకు సౌకర్యములు

మదరాసు, డిశంబరు 20 : ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు నేడు అసెంబ్లీలో ఒక ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ ప్రభుత్వ ఉద్యోగములలో చేరదలచిన రాజకీయ బాధితులకు కొన్ని సౌకర్యములు ఇచ్చుటకు నిశ్చయించెనని తెలిపిరి. గౌరవసభ్యుడు ప్రభుత్వము ఈ సందర్భమున జారీ చేసిన వుత్తర్వును చూడవలెననియు, మంజూరు చేయబడిన సౌకర్యము లేవియు ఉపసంహరించబడలేదని కూడా తెలిపిరి.

అనుబంధ ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ ఇతర అర్హతలన్నీ వున్న రాజకీయములలో పాల్గొనుట అదనపు అర్హతగా పరిగణించవలెననీ, అవసరమైన వయో నిబంధనల మినహాయింపు ఇవ్వవలెననీ ప్రభుత్వ వుత్తర్వులోని సారాంశమనిరి.

రాజకీయ బాధితులైనంత మాత్రమున ఇతర అర్హతలను పరిగణించ నవసరములేదని ఎక్కడా లేదనికూడ మంత్రి గారు తెలిపిరి.

# నెల్లూరులో వేరుశనగపిట్టు విక్రయం

నెల్లూరు హోలుసేలు కో ఆపరేటివు సంఘము కాయిదాతీసి వేసిన దరిమిలా 1949 అక్టోబరు ఆఖరువరకు 12297 బస్తాల వేరుశనగపిట్టును బ॥ కి రు 10-8-0 చొప్పున విక్రయించినదనీ, విక్రయము స్టోర్సు అఫ్యక్షు పాధ్యక్షుల అజమాయిషీ క్రింద జరిగిందనీ, అధ్యక్షుడు లేనప్పుడు ఉపాధ్యక్షుడు చీటీలు ఇచ్చేవాడనీ నేడు అసెంబ్లీలో శ్రీ పెన్నేలకంటి రాఘవయ్య ప్రశ్నకు వ్యవసాయమంత్రి జవాబు ఇచ్చిరి. అప్పట్లో బజారులో ధర 160 పౌ॥లు బస్తాకు 14 నుండి 17 వరకు వుండనీకూడ తెలిపిరి.

మార్కెటు ధరకంటె తక్కువకు ఎందుకు విక్రయించిరని శ్రీ ... కంట్రోలు ధరకు విక్రయించబడినదని వ్యవసాయ మంత్రి తెలిపిరి.

# అమెరికా పెట్టుబడికి భారతదేశ వ్యాపారవిధానం ఎంతవరకు దోహదం చేస్తుంది? ఢిల్లీసభలో చర్చలు

న్యూఢిల్లీ, డిశంబరు 19 : భారతప్రభుత్వం విదేశ వ్యాపార విషయంలో అనుసరిస్తున్న విధానం ఏవిధంగా ఇండియాలో పెట్టే అమెరికన్ పెట్టుబడిపట్ల అనువర్తిస్తుందనే విషయాన్ని గూర్చి అమెరికా భారత దేశ ప్రతినిధుల స్నేహ సంబంధాల సభలో చర్చించారు.

ఈ సభలు రౌండ్ టేబుల్ సమావేశాలుగా జరిగాయి. అవి నేటితో ముగిసాయి.

అమెరికన్ ప్రతినిధులు ఈ సందర్భంలో భారతదేశంలో పన్నుల ఉధృతం ఎక్కువగా వున్నదని, జీవిత ప్రమాణం గరిష్టంగా వున్నదని డివిడెండులను క్రమబద్ధం చేస్తున్నదని, అమ్మకపుపన్నులు, ఎక్సైజు పన్నులు ఎక్కువగా వున్నాయని, పరిశ్రమలమీదగూడాతిమకంట్రోలు వుంచడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదని, దీనికితోడు పరిశ్రమలను జాతీయం చేసే ఎత్తుగూడా వున్న అనుమానం పొడకట్టుతున్నదని ముఖ్యంగా పేర్కొన్నారు.

ఈ అన్ని విషయాల్లోను భారత ప్రభుత్వం అనుసరించగల విధానం ఇంకా ఒక రూపానికి రాకపోయినా, ప్రయివేటు పెట్టుబడులను క్రమబద్ధంచేయాలన్న ఆలోచనలు, పరిశ్రమలను జాతీయం చేయాలన్న ప్రయత్నాలు వెనకపడి నట్టుగా భావించవచ్చునని భారతదేశం ప్రతినిధులు పేర్కొన్నారు.

భారత ప్రతినిధులు ఈసందర్భంలో ఇంకో విషయాన్ని కూడా పేర్కొన్నారు. యుద్ధకాలంలో పెద్ద యెత్తుకాకపోయినా, చిన్న యెత్తున అయినా అమెరికన్ పెట్టుబడులు భారత దేశం లో ప్రవేశించాయి. అందువల్ల దేశంలోకొన్ని కీలక పరిశ్రమలు, మరికొన్ని ముఖ్యమైన పరిశ్రమలు స్థాపించడానికి సాధ్యమైంది. ఆ పెట్టుబడులు ఇండియాలో ప్రవేశిస్తున్నప్పుడు అమెరికావారు ఇక్కడ ఈ పరిశ్రమలలో పనిచేస్తున్న భారతీయులకు సాంకేతిక విద్యాప్రదానంచేసి, అందులో వారు గడితేరగానే తమదేశంనుంచి పంపించిన సాంకేతికులను ఉపసంహరించుకోడానికి అంగీకరించారు. అప్పుడు అట్లా అంగీకరించిన అమెరికావారికి ఇప్పుడు అటువంటి షరతులనే అంగీకరించ పోవడం ఎందుకు సాధ్యంకాకుండావుందో అర్థంకాకుండావుంది అని ఈ ప్రతినిధులు అన్నారు.

ఇందుకు అమెరికన్ ప్రతినిధులు ప్రత్యుత్తర మిస్తూ, ఇండియావారు చెప్పింది బాగానే వున్నా, లాటిన్-అమెరికన్ దేశాలలో తమ పెట్టుబడ్లుపడ్డ అవస్థలనుపురస్కరించుకొని, పెట్టుబడ్లలో తమదే పైచేయిగా వుండాలని, ఇంకొకళ్లకు చిక్కరాదన్న భావానికి అమెరికన్ పెట్టుబడిదార్లు వచ్చారని, అదీకాకుండా ఇప్పుడు తమజాతి భద్రతనుగూర్చిన యావగూడ వారికి ఎక్కువైంది కాబట్టి, ఇతర దేశాలలో తమపెట్టుబళ్లకు అనుకూలమైన వాతావరణం ఏర్పడితేనేగాని వారు చేయి వదల దలచుకున్నట్లు కన్పించడం లేదని అన్నారు.

అదీ కాకుండా అంతర్జాతీయంగా అమెరికా పెడుతున్న పెట్టుబళ్లు బాగా లాభసాటిగా వున్నాయి. ఇప్పుడు ఇక్కడ డివిడెండులను క్రమబద్ధం చేస్తాము, లాభాలనుపంపిణీకి పెడతామూ అంటే వారు సుతరామూ కదలమంటారు అనికూడా వారు పేర్కొన్నారు.

అందుకు భారతప్రతినిధులు అన్నారు గదా : ఆ పెట్టుబళ్లను వారు ప్రత్యేకంగాకుండా, భారత ప్రభుత్వంద్వారానే, వారు నిర్వహించదలచుకున్నా అభివృద్ధి ప్రణాళికల సాఫల్యంనిమిత్తం ఇస్తే అటువంటి శంకలేవీ ఏర్పడవు. వారి పెట్టుబళ్లకు తగినవడ్డీ గిట్టుబాటు అవుతుంది. సింకింగ్ ఫండులద్వారా బాకీ తీర్మానం అవుతూవుంటుంది. ఇటువంటప్పుడు వారు భయపడవలసిన అవసరం ఏమీ వుండదుగదా: అని కాని ఈ విధంగా వారిని ప్రలోభపెట్టడం సాధ్యమవుతుందా అన్న విషయాన్ని గూర్చి విభిన్నవర్గాలవారు వివిధ విధాలుగా అంటున్నారు. మొత్తంమీద అందరికీ ఇటువంటి సూచన నారికి ఎక్కక పోవచ్చునన్నట్లు వున్నది.

ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగీయ మహాసభ జనవరి 8 న ములుమంచిలి తాలూకా నర్సాపురం అగ్రహారంలో పి. వీరభద్రస్వామి (ఎం. ఎల్. సి.) గారి అధ్యక్షత జరుగుతుంది. రెవిన్యూమంత్రి సీతారామరెడ్డిగారు ... ప్రారంభోపన్యాసం చేస్తారు.

# ఆంధ్ర సరిహద్దులు— రాష్ట్ర కేంద్రము

## శ్రీ కాశేశ్వరరావుగారి ప్రకటన

శ్రీ అయ్యదేవర కాశేశ్వరరావు ఎం. ఎల్. ఎ. గారు యిట్లు వ్రాయుచున్నారు :—

ఆంధ్రరాష్ట్రం సరిహద్దులు నిర్ణయంచు సంఘం యిప్పుడు నియమించినచో రాష్ట్ర నిర్మాణము కాలనిర్ణయంలేక వాయిదా వేసినట్లే ఆంధ్ర ఒరిస్సా సరిహద్దులేగాక, బళ్ళారిచంగల్పట్టు చిత్తూరు చంగల్పట్టు, సేలం ఉత్తర ఆర్కాటు జిల్లాలగూర్చిగూడ విచారించాలి. ఇవన్ని ఆంధ్రరాష్ట్రం యేర్పడినాక తీరుబాటుగా నిర్ణయించవచ్చును. కోస్తాజిల్లాలు ఏడు, రాయలసీమ జిల్లాలు నాలుగు మొత్తం 11 జిల్లాలు బళ్లారిలో మూడు తాలూకాలతో కలిపి వెంటనే ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం చేయవచ్చును. ఈ సమయాన సరిహద్దు సంఘం నియమించాలని ఎందుకంటున్నారో అర్థం కాకుండా ఉంది. బళ్లారిజిల్లాలో కెల్కారు అవార్డు ప్రకారం ఆంధ్రులకు రాని 6 తాలూకాలు ఏ రాష్ట్రంలో ఉండాలో పరిపాలనా సౌకర్యాన్నిబట్టి నిర్ణయించవచ్చును.

1938 లో దేశానికి స్వాతంత్ర్యంరాకముందు, హైదరాబాదు మనదేశంలో చేరకముందు తెలంగాణా ఆంధ్రరాష్ట్రంలో చేరడానికి వీలుందని ఊహించలేనపుడు శ్రీ భాగ్ ప్యాక్టు చేయబడింది, కనుక యిటీవలి రాజకీయ మార్పులననుసరించి ఆ ఒడంబడిక అమలుజరుపవీలులేదున్నది. అనంతపురంలో విశ్వవిద్యాలయంయొక్క రెండవ కేంద్రం స్థాపించవచ్చును.

ఆంధ్రబడ్జటులో ముందుగ రాయలసీమ జిల్లాల ఆర్థిక అభివృద్ధి ఏర్పాటుచేయవచ్చును. హైకోర్టు ఏ మూలనున్నా లాయరులు పార్టీలు పోగలరు కావున అభ్యంతరము కాదు. శిక్ష రాష్ట్ర ముఖ్య పట్నంగూర్చి, ఆది రాయలసీమ, తెలంగాణా, కళింగసీమ (ఉత్తరకాశి, కోరాపుట్టి) లన్నింటికి మధ్యగ నుండాలి. ఒరిస్సాలోనున్న ఆంధ్రభాగాలు ఆంధ్రరాష్ట్రంలో నేడో రేపో చేరకతప్పదు. కనుక రాయలసీమ వారు ఒక కోననున్నందున ముఖ్యపట్నం కోరరాదు. కృష్ణ దక్షిణతీరాన ముఖ్యపట్నం కట్టిన గుంటూరువరకు పెరుగుటకు అవకాశంగలదని, అక్కడ ముఖ్యపట్నం అక్కడుండాలని ఆంధ్ర మహాసభవారు ధార్‌కమిషనుకి సూచించిరి. అటనుండి కృష్ణపై రోడుసంతెన అపుడే కాంక్షనయింది. కనుక విజయవాడ కది కలిసియుండును. డా॥ సి. రామలింగారెడ్డిగారు గూడ విజయవాడ ముఖ్యపట్నంగా నుండవచ్చనన్నారు. ఎట్లయిన కొన్నేండ్లవరకు మదరాసులోనే ముఖ్యపట్నం ఉండునట్లు కోరాలి. త్వరలో యింకోచోటికి మార్చవచ్చును. రెండు మూడేండ్లలో నిజం రాజ్యం విభాగమగును. తెలంగాణా వచ్చువరకు ఆంధ్ర ముఖ్యపట్న నిర్ణయం చేయరాదు. హైదరాబాదునగరం వచ్చినచో, విజయవాడ కన్న మేలయిన ముఖ్యపట్నమగును.

విశాలాంధ్రవాసులకు హైదరాబాదే ఎక్కువగ వచ్చును. కేరళులు కన్నడులు సంస్థానములు చేర్చుకొని విశాల రాష్ట్రములు ఏర్పరచుకొనుటకు ప్రయత్నించుచున్నపుడు ఆంధ్రులు విశాలాంధ్ర రాజ్యమునకేల ప్రయత్నించరాదు.

# ఆంధ్ర దక్షిణసరిహద్దు మహాజనసభ

తిరుత్తని, డిసెంబరు 18: ఆంధ్రదేశ దక్షిణ సరిహద్దు మహాజనసభ ఆహ్వాన సంఘ సభ్యుల సమావేశము నిన్నటిదినము తిరుత్తనియందలి వేలంజేరివారి సత్రములో డి. మునిరత్నంనాయుడుగారి యాజమాన్యమున జరిగినది. తిరుత్తని, పల్లిపట్టు, పుత్తూరుతాలూకాలలోని ప్రముఖులనేకులు వచ్చియుండిరి.

సభలో యీనెల 30వ తేది శుక్రవారము తిరుత్తనియందు ఆంధ్రదేశ దక్షిణ సరిహద్దు మహాజనుల సభను జరుపవలసినట్లును, మహాసభ ప్రారంభకులుగ ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంపంతులుగారిని, అధ్యక్షులుగ దుగ్గిరాల బలరామకృష్ణయ్య గారిని, జాతీయపతాకా రోహణమునకు గోగినేని రంగనాయకులుగారిని నిర్ణయించుచు, బులుసుసాంబమూర్తి, సామి వెంకటాచలం చెట్టి, కొంతి వెంకటరామమూర్తి కట్టూరు సుబ్బారావు మున్నగుప్రముఖులను గూడ ఆహ్వానింపవలెనని తీర్మానించిరి.

మహాసభకు తెలంగాణ, ఉత్తరాంధ్ర సీమ జిల్లాలలోని ఆంధ్రమహాజనులనూ విరివిగా విచ్చేసి కార్యక్రమమును జయప్రద మొనరించుటకు వలయు ఏర్పాటులను గూర్చి చర్చించి తీర్మానించిరి. ఈ యవకాశమును పురస్కరించుకొని ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కార్యవర్గ సభ్యుల సమావేశముగూడ యీ నెల 29 తేదివాడు తిరుత్తనియందే జరుగగలదని తెలుస్తున్నది. (స్వ. వి.)

# "న్యూస్‌ప్రింట్" దిగుమతులు

## అసెంబ్లీలో నియోగిగారి వివరణ

న్యూఢిల్లీ, డిశంబరు 19: 1949 జనవరినుంచి అక్టోబరు దాకా ఇండియా విదేశాల నుంచి 2. 97 కోట్ల రూపాయల ఖరీదు గల న్యూస్‌ప్రింట్‌ను తెప్పించినట్లు పార్లమెంటులో నేడు శ్రీ కె. సి. నియోగి ప్రకటించారు.

1949 జులై నుంచి డిశంబరు దాకా మాత్రం న్యూస్‌ప్రింట్ తెప్పించుకోడానికై లైసెన్సులు యిచ్చామని, అంతకుముందు జనరల్ లైసెన్సు వుండేది కాబట్టిన్ని, న్యూస్‌ప్రింట్ స్టెర్లింగు ప్రాంతాల నుంచే వచ్చేది కాబట్టిన్ని, అటువంటి అవసరం లేకపోయిందని, ఇప్పుడు అ... ఏర్పడింది కాబట్టి, ఈ లైసెన్సులు ఇచ్చే పద్ధతిని 1950 దాకా పాటించదలచుకున్నామని మరికొన్ని ప్రశ్నలకు సమాధానమిస్తూ తెలియజేశారు.

న్యూస్ ప్రింట్ దిగుమతుల విషయంలో ప్రభుత్వం అనుసరిస్తున్న లైసెన్సింగు విధానం ప్రతి ఆరు నెలలకు ఒకసారి మార్చడం జరుగుతుందని గూడా ఈ సందర్భంలో శ్రీ నియోగి వెల్లడిచేశారు.

1949 ఆగస్టు 15వ తేదినాటి నుంచి లైసెన్సులు లేకుండా విదేశీ వ్యాపారం చేసుకొనే సావకాశం వుండదని ప్రభుత్వం ప్రకటించింది. కాబట్టి, అప్పటి నుంచి లైసెన్సులు ఇవ్వడం ప్రారంభమైంది. ఇంతవరకు అట్లా 114 లైసెన్సులు ఇవ్వడం జరిగిందని గూడా ఆయన తెలియజేశారు.

# జిల్లేపల్లి పంచాయతీ బోర్డు ఎన్నికలు

రేపల్లె, డిసెంబరు 18: జిల్లేపల్లి పంచాయతీ బోర్డు ఎన్నికలు మొన్నను జరిగినవి. పోటీ తీవ్రంగా ఉన్నందున శాంతి భంగము లేకుండుటకు ముందుగా రిజర్వు పోలీసు బందోబస్తు చేయబడినది. ఎన్నికలు శాంతముగా జరిగినవి. బోడేప్రొడి వెంకట్రామయ్య, దేవభక్తుని చినకోటయ్య, కోనేరు ... , కటకాల వెంకట నరసాపాలు, వారితో పోటీచేసిన ... సభ్యులుగా ఎన్నిక అయ్యారు.

# ఆంధ్రరాజధానికి బందరే తగిన స్థలం

## విభజన సంఘమునకు సూచనలు చేస్తూ తీర్మానాలు

బందరు, డిసెంబరు 19 : ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు విజయవంతమైన ప్రయత్నములు చేసినందుకు రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారిని అభినందిస్తూ, బందరును ఆంధ్రరాష్ట్ర రాజధానిగా ఎన్నుకోవలెనని విభజన సంఘంవారిని కోరుతూ, నేటి సాయంత్రం ఇక్కడ పురమందిరంలో జరిగిన పెద్ద బహిరంగసభలో తీర్మానాలు చేయబడినవి. కొల్లిపర వెంకటరమణయ్యనాయుడుగారు అధ్యక్షత వహించారు.

జనవరి 26 లోగా ప్రత్యేక రాష్ట్రమును నిర్మించవలెనని కేంద్ర ప్రభుత్వమును కోరుతూ ఒక తీర్మానం చేయబడింది.

మచిలీపట్నం సర్కార్లకు, రాయలసీమకు, తెలంగాణాకు మధ్య ప్రదేశంలో వున్నదనీ, ఈ రేవును పెద్ద రేవుల్లో ఒకదానిగా పెంచుటకు అవకాశాలున్నాయనీ, విద్య, సంస్కృతి పరంగాను, వర్తక రీత్యాను యీ పట్నానికి మంచి ప్రాధాన్యత వున్నదనీ, ఇక్కడ అనేక ఇన్సూరెన్సు కంపెనీలున్నాయనీ, ఏడాది పొడుగునా శీతోష్ణస్థితి సుఖంగా వుంటుందనీ, విశాలస్థలాలు సరసమైన ధరలకు లభ్యమౌతాయనీ, ఆంధ్రుల ప్రాచీన రాజధాని శ్రీకాకుళం దీనికి దగ్గరగా వున్నదనీ, అనేక ఆంధ్రోద్యమాలు యిక్కడ జన్మించాయనీ ఈ కారణాలన్నిటివల్లా ఇక్కడ మాత్రమే రాజధాని వుండదగిందనీ, తీర్మానంలో ఉద్ఘాటితమైనది. బందరు రేవును తక్షణమే అభివృద్ధి చెయ్యాలని రాష్ట్ర, కేంద్రప్రభుత్వములను, బందరుకు బ్రాడ్ గేజ్ రైల్వే మార్గాలను వేయాలని రైల్వే అధికారులను కోరుతూ కూడా తీర్మానింపబడింది.

విభజన సంఘంవారి వద్దకు రాయబారం వెళ్లటానికి సభవారు సభాధ్యక్షునితోను, మరి కొందరితోను ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. (స్వ. వి.)

# ఉ. వి. జిల్లాకాంగ్రెస్ కార్యవర్గసమావేశం

శ్రీకాకుళం, డిసెంబర్ 17 : ఉత్తర విశాఖజిల్లా కాంగ్రెసు కార్యవర్గము గౌతు లచ్చన్న (యం. యల్. ఎ.) గారి అధ్యక్షతను 14 తేదీని ఆముదాలవలసలో సమావేశమైనది. మొత్తం 25 మందిలో 17 గురు సభ్యులు హాజరైనారు. మొదట కొత్త సంవత్సరం ఆయవ్యయఅంచనాను అంగీకరించి గుత్తావల్లి నారాయణగారిని జిల్లా కాంగ్రెసుసభ్యుడుగా కో ఆప్టు చేసు కొని రి. కోస్తానిధియేర్పాటు చేసినందుకు గవర్నరుగారిని అభినందిస్తూ తీర్మానించారు. దక్షిణవిశాఖజిల్లా కాంగ్రెసు సంఘమునుండి ఈ జిల్లాకాంగ్రెసుకందు చేర్చబడిన, సాలూరు, బొబ్బిలి, పార్వతీపురం, పాలకొండ, చీపురుపల్లి, రాయిగడ తాలూకాలకు, దామాషాగా రావలసిన ద. వి. జిల్లా కాంగ్రెసు ఆస్తిపాస్తులు, రికార్డులు పంపించవలెనని ఒక తీర్మానం చేశారు.

రాష్ట్రముఖ్యపట్నం గురించి తమిళులు ఆంధ్రులు సుహృద్భావంతోను, సామరస్యముతోను తేల్చుకొని 26 జనవరి నాటికి ఆంధ్రరాష్ట్రావతరణగావింప కృషి చేయాలనియు, అట్లాయిదా లేని ప్రాంతాలలో నిర్మాణాన్ని ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుతీర్మానానుసారముగా జరిగించుచూ, హైకోర్టు, గవర్నరును ఉభయరాష్ట్రములకు యిప్పటికి సంయుక్తంగా పనిచేయువిధముగా, ఆంధ్ర అదితరశాసనసభ్యులను మంత్రులను విడదీసి రాష్ట్రమును ఏర్పాటు చేయవలసినదిగా మదరాసుమంత్రులను విభజనసంఘాన్ని, కేంద్రప్రభుత్వాన్ని అ. భా. కాంగ్రెసు సంఘమును కోరుచు ఒకతీర్మానం చేశారు.

సాలుకు 20 లక్షల మణుగులు ఉప్పు తయారుచేయుచున్న నౌపడా ఉప్పుగల్లీలలో కొన్ని మరలు తీయుటవలన 10 లక్షల తయారులచే ఉప్పు కార్మికులకు వృత్తి లేకున్నదిగాన ఉప్పుదిగుమతుల ఆపి మరి కొన్నిమరలు పెట్టాలనికూడా తీర్మానించారు.

బింధియా కంపెనీవారు కార్మికులను సిబ్బందిని తగ్గింపనిదే నౌకానిర్మాణము లాభదాయకముగా సాగింపవీలులేదంటున్నారనీ, లేబరుయూనియన్‌వారు, ఒకచేర్పుమాత్రమే పనిజరుగుచున్నపుడే యిప్పుడున్న పనివాండ్లందరు రాత్రులందును, ఆదివారములోను పనిచేసేవారనీ, జలసంఘి అయిన విపరీతవ్యయమునకు కంపెనీవారి బాధ్యులనీ, కాబట్టి కార్మికులను తీసివేయుట అన్యాయము, అక్రమము అంటున్నారనీ, కాబట్టి కేంద్రప్రభుత్వంవారు కార్మికులకు న్యాయముకలుగచేయవలెనని మరొకతీర్మానం చేశారు.

# కంభం చెరువుతొట్టు గ్రామాలకు తుపాను, వరదలవల్ల కలిగిన నష్టం

## రైతులకు చేయవలసిన సహాయం గురించి చేగిరెడ్డి బాలిరెడ్డిగారి ప్రకటన

కంభం, డిసెంబరు 18 : ఆంధ్రరాష్ట్ర రైతు కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ చేగిరెడ్డి బాలిరెడ్డిగారి విధంగా వ్రాస్తున్నారు. ఈ మధ్య రెండు దఫాలుగా వచ్చిన తుఫాను వరదల వలన కర్నూలు జిల్లాలోని కాకర్ల, నాగులవరం, బోగోలు మోహదీన్‌పురం, లింగాపురం, పెద్దనల్లకాల్వ యర్రబాలెం మొదలగు గ్రామాలు విపరీతమైన కష్టనష్టాలకు లోనైనవి. కంభం చెరువు అలుగునీరు 11 అడుగుల యెత్తున ప్రవహించడముతోటి, పై గ్రామాలు, వాటికి సంబంధించిన పంటభూములన్ని జలమయమై కనివినియెరుగని వంటటి నష్టము కలిగినది. పంట అంతా నష్టమైపోయినది. విత్తనాల గింజలు వ్యవసాయ ఖర్చులు, పెట్టుబడి యావత్తు దండగఅయిపోయినది. పశువులకుపనిలేనందున హీన ధరలకు అమ్మివేస్తున్నారు.

రైతుకాంగ్రెసు కోర్కెపై, కర్నూలు జిల్లా కలెక్టరు, ఈ గ్రామాలలో శిస్తువసూళ్లను నిలుపుదల చేశారు. ఆ మాత్రం చాలదు. వెంటనే నీటిలోనున్న భూములకూ వరదల వలన చెడిపోయిన భూములకు పూర్తిశిస్తు రిమిషను ప్రకటించాలి. చెడిపోయిన భూములను బాగుచేసికొనుటకు అవసరమైన పెట్టుబడిని, ప్రభుత్వం వడ్డీ లేకుండా, దీర్ఘవాయిదాలపై తీర్చుకొనే పద్ధతిపై అప్పులివ్వాలి, పై పేర్కొనబడిన రైతులపై వున్న కోర్టు డిక్రీలనూ, అప్పులనూ, 3 సంవత్సరముల వరకూ అమలుగాకుండా, శాసనం చేయాలి. రాబోవు, మూడు సంవత్సరముల వరకు రైతులదగ్గర యేలాటి శిస్తులవసూలు చేయకూడదు. న్యాయంగా వసూలు చేయవలసిన శిస్తులను మూడు సంవత్సరముల తరువాత, మూడు సంవత్సరముల మీరట చెల్లించే యేర్పాటు వసతి చేయాలి.

కృష్ణ, గోదావరిజిల్లాలలో వరదబాధిత ప్రాంతాలపై చూపుతున్న శ్రద్ధ ఆసక్తి యీ ప్రాంతాలపై కూడా చూపి తీరాలి. రాయలసీమలో వరదల వలన విపరీతంగా బాధపడిన గ్రామాలు కొద్దిగాబట్టి తగిన ప్రచారం, ప్రకటన, ఆందోళనలు లేపు కాని నష్టాలు మాత్రం విపరీతం.

ప్రభుత్వం వెంటనే శ్రద్ధవహించి పై చెప్పిన వసతులు కల్పించి రైతురక్షణకు పూనుకోవాలని నావిజ్ఞప్తి.

# పూర్తి శిస్తు రెమిషన్ ఇవ్వాలి

## రైతు ప్రతినిధుల సమావేశ తీర్మానాలు

ఎర్రబాలెం, డిసెంబర్ 18 :—ఒంగోలు లింగాపురం, మోహదీన్‌పురం, నాగులవరం, ఎర్రబాలెం, పెద్దనల్లగాల్వ, నర్వక్రిందిపల్లె చిన్ననల్లగాల్వ గ్రామాల ప్రతినిధులు ఇక్కడ చేగిరెడ్డి బాలిరెడ్డిగారి అధ్యక్షతన సమావేశమయ్యారు. సభకు నరాల అల్లూరి రెడ్డి చప్పిడి వెంగయ్య రామిరెడ్డి, మల్లా రెడ్డి, చప్పిడి వెంకటసుబ్బయ్య, కంగిరెడ్డి, మొదలగువారు హాజరైనారు.

వరదల వలన, కంభం చెరువు తొట్టు గ్రామాల రైతులకు సంభవించిన దుస్థితిని గురించి చర్చించిన పిదప ఈ గ్రామాలకు పూర్తి శిస్తు రిమిషను యివ్వాలని, భూములపై పెట్టబడిన యిసుక ఆన్నెలు తీసివేయుటకు, తదితర రిపేర్లు చేయుటకు, వడ్డీ లేకుండా అప్పులు యివ్వాలని, గుండ్లకమ్మకత్వ దగ్గర "జంతి కట్ట" కట్టించాలనీ, జంపాలేరు గుండ్లకమ్మ అనకట్టలు దిట్టంగా కట్టించాలనీ తీర్మానాలు చేశారు.

చేగ్వ తొట్టు రైతు మహాసభ త్వరలో జరుపుటకు తీర్మానిస్తూ చేగిరెడ్డి ఈశ్వరరెడ్డి అధ్యక్షుడుగా ఆర్. మల్లారెడ్డి కార్యదర్శిగాగల ఒక రైతుకాంగ్రెసు సంఘాన్ని యెన్నుకొన్నారు

# సనకా సుబ్బారావుగారి అరెస్టు

మచిలీపట్నం, డిసెంబరు 19 : దివి తాలూకా గాజులలంక కాపురస్థుడు సనకా సుబ్బారావుఅను కమ్యూనిస్టు గుంటూరులో యున్నాడని తెలిసి స్థానిక పోలీసువారు గుంటూరుకువెళ్లి అతనిని అరెస్టుచేసి ఇచ్చటకు తీసుకొనివచ్చిరి. ఇతనిపై నిషేధున్న వారంటు ఉండెనని తెలిసినది.

జొట్టాయిపేటలోని అప్వకేటు మురాల లక్ష్మీపతిగారి యింటను స్థానిక సర్కిల్ ఇనస్పెక్టరు జి. శ్రీమంతు, రాబర్టుసన్ పేట పోలీసు సబుఇన్స్పెక్టరు యం. బి. ప్రభాకరావుగార్లు నిన్న సోదాచేసిరి. రెండు ఫోటోగ్రాఫులు కోరికినవని తెలిసినది. (స్వ. వి.)

# నీవానదిపై వారధి నిర్మాణం

## చిత్తూరు పురపాలక సంఘం తీర్మానాలు

చిత్తూరు, డిసెంబరు 15 : ఈ వూరికి సంతపేటకు మధ్యగల నీవానదిపై వారధి నిర్మించాలనీ, ఇందుకు అయ్యేవ్యయం 2 లక్షలలో గ్రాంటుక్రింద ఇచ్చే లక్ష పోను మిగతా లక్షను కూడా అప్పుగా ఇవ్వవలెనని ప్రభుత్వాన్ని కోరుతూ ఈ పురపాలక సంఘంవారు ఈ నెల 11-వ సమావేశమై తీర్మానించారు. మొత్తం 21 మంది సభ్యులలో 9 మంది మాత్రమే హాజరైన ఈ సమావేశానికి సి. రఘుపతి శెట్టిగారు అధ్యక్షత వహించారు. చిత్తూరు మద్రాసుకు చాలా సమీపమున ఉన్నందువల్ల, మద్రాసు తమిళనాడులో చేరిపోతున్నందువల్ల చిత్తూరును కూడా తమిళరాష్ట్రములో చేర్చవలెనని ప్రభుత్వమును కోరుతూ ఒక తీర్మానము, స్థానిక ముస్లిముల శ్మశానము గోరీలదొడ్డినిమిత్తం లోగడ మంజూరు చేసిన చింతతోపులో 5 సెంట్లు మాత్రమే అందునిమిత్తమిచ్చి మిగతా స్థలమును ప్రభుత్వ ఉత్తరువు ప్రకారం తిరిగి స్వాధీనము చేసికొనవలెనని వేరొక తీర్మానము చేశారు. స్వ. వి.

# తెనాలి పురపాలక సంఘ సమావేశం

తెనాలి, డిసెంబరు 17 : ఈ పురపాలక సంఘసమావేశం సంఘఅధ్యక్షులు నన్నపనేని వెంకట్రావుగారి అధ్యక్షతను జరిగినప్పుడు తెనాలిలో మసూచి వ్యాధియింకా ఉన్నందున ఆరోగ్యశాఖాధికారి కోరికపై ప్రత్యేక సిబ్బందిని జనవరి వరకు ఉంచుటకు నిర్ణయించారు. ఆఫీసులో, నెలకొల్పిన సైరను నుపయోగించు వేళలను ఉ 7గం. మధ్యాహ్నం 11గం. సాయంకాలం 5గంటలని నిర్ణయిస్తూ, యీ సైరను మోతను ఒకనిమిషముసేపు ఉంచుటకు తీర్మానించారు. ప్రాథమిక విద్యకు సంబంధించిన బడ్జెటును గురించి చర్చించుటకుగాను గద్దె శ్రీ దేవమ్మ, అబ్దుల్ వాహబ్ సాహెబ్, పఠాన్‌మస్తాన్‌ఖాన్, రావి హైమారావు, ఉపద్రష్ట వెంకట్రామయ్య, మోటమర్రు ఆదినారాయణ, జి. సుబ్బదాసు- ఎస్. ఎల్. నారాయణగారలతో ఒక సంఘాన్ని నియమించారు.

టవున్ ప్లానింగు కమిటీకి వడ్లమూడి కోటయ్య చౌదరి, బలభద్రపాత్రుని కనకసుందరం, నన్నపనేని వెంకట్రావు, అబ్దుల్ వాహబ్ సాహెబ్, సూర్యదేవర లక్ష్మీనారాయణ, కంచర్ల మంగపతిరావుగారలను నియమించారు.

ఇండ్ల పన్ను పరిష్కారం చెయ్యటానికి గాను పావులూరి రామారావు, కోట పున్నయ్య, వి. సుబ్బయ్య ఎ. భావనారుషి, గారలతో ఒక సంఘాన్ని నియమించారు. (స్వ వి.)

# బందరు పురపాలక సంఘ సమావేశం

బందరు, డిసెంబరు 16 : ఈ పురపాలకసంఘ సమావేశం ఉపాధ్యక్షులు కె. నరసింహారావుగారి అధ్యక్షతను మొన్న సాయంకాలం జరిగినప్పుడు 25 విషయాల అంచనాలు చర్చకురాగా, తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు కొన్నింటిని తీసుకొని అంచనాలలోని లోపములనుచూపి, వాటివిషయంలో కావలసిన వివరాలను ఆఫీసువారుయివ్వలేకపోయిరి కాన, అన్ని అంచనాలను వాయిదా వెయ్యాలని కోరారు. దానిపై డా॥ కోకా నరసింహారావుగారు ఒక్కొక్క విషయాన్ని తీసుకొని చర్చించి పరిష్కారము చెయ్యవలెనని ప్రతిపాదించారు. సుబ్రహ్మణ్యేశ్వరరావు అంచనాల నన్నింటిని ఆమోదించాలన్నారు. పెద్ద మొత్తములుగల అంచనాలు 5 ని తీసుకొని వాటిని మినహాయించి, మిగిలిన 20 విషయాలను ఆమోదించాలని విన్నకోట వెంకటస్వామినాయుడుగారు తెచ్చిన తీర్మానం చివరకు అంగీకరించబడింది. ఏ పని యైననూ సరే మొత్తములతో నిమిత్తం లేకుండా టెండర్లు పిలవాలనీ, నామినేషనులు పనికిరావనీ ఒకరు ప్రతిపాదించగా శీలంసెట్టి హనుమంతరావుగారు బలపర్చారు. కాని అధ్యక్షులు దానిని త్రోసిపుచ్చారు. (స్వ. వి.)

# కార్వేటినగరం హైస్కూలుకు కొత్తభవనం

## జమీందారుగారి వితరణ

నగరి, డిసెంబరు 17 : చిత్తూరు జిల్లా బోర్డు అధ్యక్షుడు ఎస్. పి. చెంగల్రాయనాయుడుగారు నేడు కార్వేటి నగరం వచ్చారు. వారి రాకను పురస్కరించుకొని బోర్డు ఉన్నతపాఠశాలలో బహిరంగసభ ఏర్పాటు అయింది. కార్వేటినగరం జమీందారు కుమారస్వామి రాజాగారు అధ్యక్షత వహించారు. జిల్లాబోర్డు సభ్యులు, పుర ప్రముఖులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు. కార్వేటినగరం పంచాయితీ బోర్డువారు, ఉన్నతపాఠశాల ఉపాధ్యాయుల సంఘంవారు, ఎలిమెంటరిపాఠశాల ఉపాధ్యాయుల సంఘంవారు జిల్లాబోర్డు అధ్యక్షునికి సన్మాన పత్రములు సమర్పించారు.

కుమారస్వామి రాజాగారు ఉపన్యసిస్తూ, ప్రస్తుత పాఠశాల భవనాలు శిథిలావస్థలోవున్నవనీ పైగా విద్యార్థులకు అందుబాటులో లేవనీ కనుక తమ రాజభవనాన్ని పాఠశాలకు యిచ్చివేయడానికి నిశ్చయించారని వెల్లడించి పాఠశాలను ఆ భవనంలో తక్షణం, నెలకొల్పడానికి జిల్లాబోర్డు అధ్యక్షులు తగు చర్యలు తీసుకోవలసిందని కోరారు. ధారావిధంగా చెప్పడంతో సభలో హర్షధ్వానాలు చెలరేగాయి.

తర్వాత జిల్లాబోర్డు అధ్యక్షుడు ప్రసంగిస్తూ, ఉన్నత పాఠశాలకు గాను రాజాగారు కొన్ని లక్షలు విలువగల రాజభవనాన్ని ఇచ్చినందుకు వారికి కృతజ్ఞత తెలుపుతూ, వారి దాతృత్వమును, గుణగణములను ప్రశంసించారు. పాఠశాలకు శ్రీ శ్రీ వెంకట పెరుమాళ్ళ రాజాగారి పేరు పెడతామని కూడ తెలిపారు. పిమ్మట ఉపాధ్యాయుల విధులను వివరిస్తూ, వారు మానవ జీవితానికి మార్గదర్శకులుగా ఉండాలన్నారు.

సభానంతరం ఉన్నత పాఠశాల విద్యార్థులు "చరిత్ర హీనులు" అను నాటకమును ప్రదర్శించారు. జి. బో. అధ్యక్షుడు ప్రదర్శనమును మెచ్చుకొని రు 20/- బహూకరించారు. నాటకానంతరం పి. ధర్మారావు గారు "స్వరాష్ట్రం సాధించురా తెలుగోడా!" అను పాటను పాడారు. శ్రీ పి ధర్మారావు జి. బో. అధ్యక్షుడు పాటకుని మెచ్చుకొని రు 5 బహూకరించారు. (స్వ. వి.)

ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం డిసెంబరు 25 సా॥ 5 గం. విజయవాడలో ఆంధ్రరత్న భవనమందు జరుగును.

# 'దేశీయ వైద్యాన్ని ప్రభుత్వం అభివృద్ధిలోకి తీసుకొనిరావాలి'

## ఆంధ్రరాష్ట్ర ఆయుర్వేద విద్యార్థికాంగ్రెస్ మహాసభలో ప్రముఖుల ప్రసంగములు

గుంటూరు, డిసెంబరు 20 : ఆంధ్రరాష్ట్ర ఆయుర్వేద విద్యార్థి కాంగ్రెస్ చతుర్థ మహాసభలు గుంటూరు పట్టణమున శ్రీ రామమోహన ఆయుర్వేద కళాశాల భవనమున డా॥ కాసులనాటి ఆంజనేయ శర్మగారి అధ్యక్షతను ఈ నెల 17, 18, తేదీలయందు జరిగెను. మహాసభలకు ఆంధ్రదేశమందలి పలుప్రాంతములనుండి అనేక మంది ప్రతినిధులు విచ్చేసిరి. ప్రతినిధులకు, ఆతిథులకు, ఆహ్వాన సంఘాధ్యక్షులు డా॥ దవి శ్రీరామాచార్యులుగారు స్వాగతమిస్తూ ఆయుర్వేదము నుద్ధరించుటకు మనమంతా బద్ధకంకణులము కావాలని ఉద్బోధించిరి.

"జనగణమన" జాతీయగీతముతో కార్యక్రమం ప్రారంభమయ్యెను. సభను గుంటూరు పురపాలక సంఘాధ్యక్షులు ఉప్పుటూరి పున్నారావుగారు ప్రారంభించుచూ ఆయుర్వేదము సర్వాంగ సంపూర్ణమైనదనీ, బ్రిటిషు ప్రభుత్వకాలములో క్రమముగా క్షీణించినను, ప్రజలలో విశ్వాసము కలిగియుండుటచేత నేటికీ సజీవమైయున్నదనీ అన్నారు. ప్రస్తుతం కాంగ్రెసు ప్రభుత్వమువచ్చి దేశీయ వైద్యమునకు ప్రోత్సాహమివ్వకుండుట నిరాశను కల్గించుచున్నదన్నారు. దీనికి కారణము ఇంగ్లీషువారు వెళ్ళినను వారి ప్రభావమింకా పోకుండా ఉండటమే నన్నారు. దేశీయవైద్యాన్ని జాతీయప్రభుత్వం ఒక జాతీయకళగా నెంచి అభివృద్ధిలోనికి తీసుకరావలసిన బాధ్యతయున్నదన్నారు.

అనంతరం మహాసభాధ్యక్షులు ప్రసంగిస్తూ, ప్రస్తుత ప్రభుత్వము ఆయుర్వేదమందు చూపు అనాదరణ జాతినాశమునకు దారితీయ గలదన్నారు. వెనకటి మంత్రివర్గం దేశీయవైద్యానికి చేసిన సహాయమునుకూడ ప్రస్తుత ప్రభుత్వం రద్దుచేసి నందులకు వైద్యులలో తీవ్రమైన నిరాశను కల్గించినదన్నారు. ప్రపంచమున ఆర్థిక దుస్థితి ఏర్పడిన ఈ సమయమందు విదేశవైద్యానికి కోట్లకొలది ధనము వెచ్చించుచూ సులభ సాధ్యమైన ఆయుర్వేద వైద్యమును దరిచేరనీయకుండుట శోచనీయమన్నారు. ఆంధ్రరాష్ట్రము త్వరలో వచ్చుచున్నందున రానున్న ప్రభుత్వం జాతీయకళకు ప్రోత్సాహ మివ్వగలదని విశ్వసించవలసి యున్నది. విద్యార్థులు సంఘీభావముకలిగి తీవ్రాందోళన జరుపవలెను.

మన నాయకులంతా మహాసభలందు చేసిన వాగ్దానములను మరువక ప్రభుత్వమందున్నపుడు ఆచరణలో పెట్టవలెనని కోరుచున్నాం. విదేశవైద్యులయొక్క మాటలు విశ్వసించక దేశీయ వైద్యముయొక్క నిజపరిస్థితిని ఔన్నత్యమును గుర్తించవలెను. పురపాలక సంఘాలు, జిల్లాబోర్డులు వాటి చికిత్సాలయములందు దేశీయ వైద్యులను చికిత్సకులుగా నియమించవలెను. పరిపాలకులు ఈ విషయమున శ్రద్ధవహించవలెనని కోరుచున్నాను. సంఘసభ్యులందరు క్రమశిక్షణ కలిగి విజ్ఞానము కలిగి రానున్న ఆంధ్రరాష్ట్రమును బలిష్టముగా చేయుటకు సిద్ధముగా యుండవలెను. అని అధ్యక్షులు తమ ఉపన్యాసమును ముగించిరి.

ఈ సందర్భమున దేశిరాజు కృష్ణశర్మగారు వైద్యము విజ్ఞానము నాగరికత, అను వాటి సంబంధము వాటివలన దేశమునకు కలుగు ప్రయోజనము గూర్చి వివరంగా ఉపన్యసించిరి.

పై మహాసభల సందర్భమున 18 వ తేదీనాడు గాంధిపార్కులో డా॥ డి. రంగాచార్యులగారి అధ్యక్షతను ప్రచారక మహాసభ జరుపబడెను. ఈ సభను ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు అధ్యక్షులు సుంకర సత్యనారాయణగారు ప్రారంభించిరి. పలువురు ప్రముఖులు ఉపన్యసించిరి.

నూతన సంవత్సరమునకు యన్నం పుల్లారెడ్డిగారు అధ్యక్షులుగాను, చిర్రావూరి రామమూర్తిగారు ప్రధాన కార్యదర్శిగాను, పరాంకుశం రామాచార్యులుగారు కోశాధిపతిగాను డా॥ అనూరి నరసింహాచార్యులుగారు ప్రచారశాఖా కార్యదర్శిగను ఎన్నుకోబడిరి. ఇంకా 12 గురు సభ్యులుకల కార్యవర్గం ఎన్నుకోబడెను.

ప్రభుత్వ గ్రామవైద్యశాలలను, ఎ. బి. తరగతులుగా విభజించి అందు బి. తరగతి చికిత్సాలయములను బి. తరగతి వైద్యులకు ప్రత్యేకించవలసిందిగాను, ప్రత్యేక కమిటీలచే నడుపబడు రికగ్నైజ్డు ఆయుర్వేద కళాశాలలను ప్రభుత్వం స్వాధీనపరచుకొని, ఒకే పాఠ్యక్రమమును ఒకే విద్యాపట్టమును ఏర్పాటు చేయుచు దీనికిగాను వెంటనే ఒక ఉపసంఘాన్ని నియమించవలెననికోరుతూ తీర్మానించిరి.

పదివత్సరములు వైద్యానుభవము కలవారికి రిజిష్ట్రేషన్ పొందుహక్కు తీసివేయుటయందు తమ నిరసన తెలుపుతూ ఆ వైద్యులకు ప్రత్యేక పరీక్షలపెట్టియైనను రిజిష్ట్రేషన్ పొందుహక్కు కలుగచేయవలెనని కోరారు. ప్రత్యేక గురుకులములను రిజిష్టర్ చేసి అచటి విద్యార్థులను వెనుకటివలెనే రిజిష్టర్ చేయవలెనని కోరారు.

భో[illegible] కమిటీరిపోర్టు ప్రకారము ఏర్పాటు చేయబడిన ఆరునెలల కోర్సుకు అర్హులైనవారిని నిర్ణయించుటలో ప్రభుత్వవిధానమునకు నిరసన తెల్పుతూ, రికగ్నైజ్డు ఆయుర్వేదకళాశాలల పట్టభద్రులకు తప్పక స్థానమివ్వవలసినదిగా, కోరుచూ తీర్మానించిరి.

# ఒంగోలుతాలూకా స్ఫోటకంవ్యాధి: 800 కి సోకి 150 మంది మరణం

ఒంగోలు, డిసెంబరు 18 : కొన్ని మాసాలుగా ఈ తాలూకాలోనిట్టి కొన్ని గ్రామాలలో స్ఫోటకంవిపరీతంగా వ్యాపించుచున్నది. యిప్పటివరకు వచ్చిన వార్తల ప్రకారం 800 మందికి వ్యాధి సోకినదనియూ, వారిలో 150 మంది దాకా మరణించినట్లు తెలియుచున్నది. యిప్పటికిని గోనుగుంట, మర్లపాడు, కావుటూరి పాలెం గ్రామాదులలో పరిస్థితి దారుణంగా వున్నట్లు తెలిసినది. ప్రభుత్వంవారు అత్యవసర చర్యలు గైకొని పరిస్థితిని చక్కబరచుట అత్యవసరము. గ్రామాలలోని ప్రజలు బెదరపెట్టుకొనుచున్నారు. కొన్ని గ్రామాలలో ఒకటి రెండు కుటుంబములే పూర్తిగా అహుతి అయినటు తెలియుచున్నది. ఒంగోలు పట్టణంలో గూడ యిప్పటికి 5 గురికి సోకి ఇద్దరు మరణించిరి.

### చక్కెర పంపకం : ప్రజల యిబ్బందులు

ఈ పట్టణంలో చక్కెర నిల్వలు వున్నప్పటికి స్థానికాధికారులు విడుదల వుత్తర్వులు యివ్వనందు వల్ల ప్రజలు నానా బాధలు పడుచున్నారు ప్రస్తుతం చాటు మాటునా 1 వీశె రు 5-0-0 వంతున అమ్ముచున్నటు తెలియుచున్నది. చక్కెర పరిట్లు కూడ ఒకసారికి మాత్రమే కార్డుకు 1/4 వీశె (సవా శేరు) యిచ్చుచున్నారు ఉద్యోగస్థులకు పలుకుబడి గలవారలకు మాత్రం సక్రమంగా దొరుకుచున్నట్లు తెలిసినది. (స్వ. వి.)

# 116 తులాల నల్లమందు పట్టుబడుట

రాజమహేంద్రవరం, డిసెంబరు 18 : స్థానిక పోలీసు సర్కిల్ ఇనస్పెక్టర్ బన్సీలాల్, సబ్ ఇనస్పెక్టరు శంకరరావుగార్లు నిన్న యిచ్చటి ఆర్యాపురం బస్సుస్టాండు వద్ద కీలారి చంటమ్మ, కొకె సన్యాసిగార్ల దగ్గర 116 తులముల నల్లమందు పట్టుకొని కేసు పెట్టిరి. (స్వ. వి.)

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 23 శుక్రవారం

### మద్రాసు (ఏ)

ఉ॥ 7-30 ఎస్. కనకం గానం. మ॥ 1-40 సినిమాసంగీతం. సా॥ 4-30 పాశ్చాత్య సంగీతం. 5-30 లలితా లక్ష్మీరతన్ గానం. 6-20 వి. హరిహరయ్యర్ గాత్రం. రాత్రి 8-15 ఎస్. విద్య వీణ.

### మద్రాసు (బి)

ఉ॥ 7-0 వార్తలు. 8-30 హిందీపాఠం. మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-50 వార్తలు. 2-15 ఉ. పా. విద్యార్థులకు సా॥ 4-0 పా. విద్యార్థులకు సా. 4-0 రా ప్రా. పా. విద్యార్థులకు 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7-0 వార్తలు. 7-15 గ్రా. కా. 7-45 ఇండియా వాయు విమానవిజ్ఞాన ప్రసంగం. పి. శ్రీనివాసరావు రా॥ 9-30 శ్రోతలు కోరిన పాటలు. 10-0 సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనలు. యస్. రాజం.

### విజయవాడ

ఉ. 7-0 వార్తలు. 7-15 ఎస్. పి. వసంత కోకిలం (రి). 7-30 అయ్యగారి సోమేశ్వరరావు వీణ. 8-15 గీతావళి కొమరగిరి రామతిలకం 8-30 హిందీ పాఠం 8-50 అధికార్ల నరసింగరావు పాటలు. మ॥ 12-30 మా. పా. విద్యార్థులకు 1-0 ఫిలింపాటలు. 1-50 వార్తలు 2-15 ఉ. పా. విద్యార్థులకు సా. 4-0 ప్రా. పా. విద్యార్థులకు 5-30 కె. కనకారావు సితార్, చిత్రజల్లు రామమూర్తి తబలా 6-20 గీతావళి కొ. రామతిలకం. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7- వార్తలు. 7-15 గ్రా. కా 7-30 ఫిలింపాటలు 7-45 సంస్కృతి సాహితీశోధ విశ్వనాథ సత్యనారాయణ ప్రసంగం రా॥ 8-0 సోమేశ్వరరావు వీణ 8-30 నరసింగరావు గానం. 9-15 పాదుకాపట్టాభిషేకం. హ. రి కథ పిల్లలమర్రి రామదాసు భాగవతార్,

### హైదరాబాద్

ఉ. 7-30 కిరాత్ కాలాముల్లా 7-45 నాట్ 7-50 అబ్దుల్‌కరీం, బృందం ఘజల్, 8-20 జి. పైడిస్వామి నాగస్వరం. 8-50 వార్తలు 9-15 పిల్లల కార్యక్రమం. మ. 12-30 కవాలీ 1-50 వార్తలు సా. 5-0 అబ్దుల్‌కరీం, బృందం బంసా ఘజల్ 5-20 లక్ష్మీబాయి బరోడ్కర్ ఖయాల్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7-0 వార్తలు 7-15 గ్రా. కా. 7-40 హైదరాబాదులో కళా కేంద్రాలు అలంపురం గురించి ఎ. వీరభద్రరావు ప్రసంగం. రా. 9-15 పైడిస్వామి నాగస్వరం.

## గంటల పంచాంగం

విరోధి నం॥ పుష్య శు॥ తృతీయ
1949సం॥ డిసెం॥ 22 గురువారం
శు॥ తృతీయ సా 7 19 ఈపా ప 1 30
... సా 5 31 ల 7 8 ...
శు చవితి డిసెం॥ 23 శుక్రవారం
శు॥ చవితి సా 6 59 ... ప 1-38 వర్జ్యం
సా 5.44 ల 7-24 ...



ఆంధ్రపత్రిక
విరోధి నం॥ పుష్య శు॥ తృతీయ
గురువారం

## నూత్న రాజ్యాంగం: ఆంధ్రరాష్ట్ర నిర్మాణం

భారత ప్రభుత్వము గనుక నూత్న రాజ్యాంగము అమలుజరుగు క్షణమునుండి ఆంధ్ర ప్రత్యేక రాష్ట్రముగ వ్యవహరింపవలెనని తీర్మానించిననే తప్ప ఆంధ్రను నూత్న రాజ్యాంగమునందు రాష్ట్రముల జాబితాలో పేర్కొనుట సాధ్యముగాదని స్పష్టమైనది. కేంద్రప్రభుత్వమునకు అట్టిసంకల్పమున్న రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను ప్రత్యేక రాష్ట్రముగ ఎన్నడో పేర్కొనియుండవచ్చును. రాష్ట్రము రూపొందలేదను కారణమున జాబితాలో చేర్చవీలులేదను రాజ్యాంగ రచనా సంఘము వారి వాదము నూత్న రాజ్యాంగము అమలు జరిగినప్పటినుండి మాత్రమే సహేతుకమగును. 1935 వ సంవత్సరము భారత ప్రభుత్వ శాసనమునందు ఇందుకు సంబంధించియున్న సౌకర్యములను నూత్న రాజ్యాంగమునందు చేర్చకపోవుటవలనను, మొదటి షెడ్యూలులోని 'ఏ' భాగమునకు కొన్ని నిర్వచనములను చేర్చుటవలనను, ఈ షెడ్యూలునందు పేర్కొనబడిన 'స్టేట్స్' యావత్తు రాజ్యాంగము ... జరుగుటతో నిర్దుష్ట స్వరూపమును పొందవలసిన యవసరము ఏర్పడినది. నూత్న రాజ్యాంగమునందలి రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను ఏదశలో పేర్కొనను, నూత్న రాజ్యాంగము అమలు జరుగుటతో రాష్ట్రస్థాపన జరుగవలసియుండును. కాని నూత్న రాజ్యాంగమును పరిషత్తు ఆమోదించు నాటికి నూత్న రాష్ట్రనిర్మాణము పూర్తికాకున్న షెడ్యూలులో చేర్చుటకు వీలుగాదను వాదము ఎన్నటికి సహేతుకము గాదని సింధు, ఒరిస్సా, రాష్ట్రముల నిర్మాణక్రమమే స్పష్టము చేయుచున్నది.

భారతప్రభుత్వము ఆంధ్రరాష్ట్ర నిర్మాణ తేదీ విషయమై ఒక ఖచ్చితమైన అభిప్రాయమునకు వచ్చియుంటే, నూత్న రాజ్యాంగము అమలుజరుగుటతో ఆంధ్రరాష్ట్రము వ్యవహరింపగలదని తెలిపియుండిన ముసాయిదాలోనే రాష్ట్రముల జాబితాయందు ఆంధ్రను పేర్కొనుటకు, ఆప్రకారముగ రాజ్యాంగ పరిషత్తు ఆమోదించుటకు ఎట్టి ప్రతిబంధకము లుండెడివి గావు. ముసాయిదాయందుగాని, నవంబరు 26 వ తేదీ తరువాత రాజ్యాంగ చట్టమునందుగాని ఆంధ్రను రాష్ట్రముల జాబితాలో పేర్కొనుట జరిగియుండిన కేంద్రప్రభుత్వము విధిగ రాష్ట్ర నిర్మాణమునకు చర్యలు తీసుకొనవలసియుండును. అట్టి బాధ్యతను వహింప కేంద్ర ప్రభుత్వము ఇదివరలో సమ్మతించి యుండనందుననే పరిస్థితులు విషమించి ఆంధ్రరాష్ట్రనిర్మాణ వ్యవహారము క్లిష్టమైనది. ఈ విధముగ 1950 జనవరి 26 నాటికి గాని ఆనాడు నూత్న రాజ్యాంగము అమలు జరుగుటతోగాని ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడగల యవకాశము వుండినగాని నూత్న రాజ్యాంగ నిబంధనల ప్రకారము మామూలుపద్ధతిని ఆంధ్రను రాష్ట్రముల జాబితాలో పేర్కొనుట దుస్సాధ్యముగ కన్పించుచున్నది.

అయితే నూత్న రాజ్యాంగమునందలి 21 వ భాగములోని 391 వ సెక్షను ప్రకారము అధ్యక్షుడు (క్రొత్తరాష్ట్ర) నిర్మాణము విషయములో కొన్ని చర్యలు తీసుకొనవచ్చును. "నూత్న రాజ్యాంగము ఆమోదింపబడిన తేదీకి (నవంబరు 26) నూత్న రాజ్యాంగము అమలు జరుగు తేదీకి (1950 జనవరి 26) మధ్యను 1935 వ సంవత్సరపు భారతప్రభుత్వ శాసనమును అనుసరించి భారతప్రభుత్వ మేమైన చర్యలు తీసుకొనియుండిన పక్షమున, ఆ చర్యల ఫలితముగ రాజ్యాంగ శాసనమునందలి 1, 4 షెడ్యూలులలో మార్పులు చేయుట యవసరమని అధ్యక్షుడు భావించిన, ఒక ఉత్తరువుద్వారా అట్టిసవరణలు రాజ్యాంగ శాసనమునందు చేయవచ్చును." అని 391 (1) క్లాజు సూచించుచున్నది. దీనినిబట్టి కేంద్రప్రభుత్వము 1950 ఏప్రిల్ 1 నాటికైనను ఆంధ్రరాష్ట్ర నిర్మాణము పూర్తి కాగలదని, ఆ తేదీ నుండియు ప్రత్యేకాంధ్రరాష్ట్రము వ్యవహరించుననియు విశ్వసించిన, 1935 శాసనమునందలి 290 సెక్షను ప్రకారము ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉత్తరువును ఇందుకు అనుకూలముగ తయారుచేసి గవర్నరు జనరల్ చే జారీ చేయింపవచ్చును. తదనుకూలముగ అధ్యక్షుడు మొదటి షెడ్యూలునే గాక, షెడ్యూలునందలి నిబంధనలను అందుకు తగినట్లుగ సవరింప వీలు కావచ్చును. రాజ్యాంగ నిబంధనలనుబట్టి ఇట్టి విధానమును అనుసరించుట సాధ్యమనియే తోచుచున్నది. అధ్యక్షుడు 1935వ సంవత్సరపు భారతప్రభుత్వ శాసనమునందలి 290 సెక్షను ప్రకారము భారత ప్రభుత్వము తీసుకొను చర్యనుబట్టి అవసరమైన యావత్తు సవరణలను చేయుటకు అధ్యక్షునికి అధికారమున్నదిగనుక ఆంధ్రరాష్ట్రమునకు తాత్కాలిక స్వరూప మేర్పడి వ్యవహరించుచుండినగాని షెడ్యూలునందుండుటకు వీలులేని నిబంధనను సైతము సవరించి 1950 ఏప్రిల్ 1 నుండియు ఆంధ్ర ప్రత్యేకరాష్ట్రముగ వ్యవహరింపగలదని స్పష్టము చేయవచ్చును. 1950 జనవరి 26 అనంతరము రాష్ట్రనిర్మాణము అంత సులభముగాదు గనుక, ఈ లోపునే రాష్ట్రనిర్మాణ ఉత్తరువు జారీయగునట్లు ఆంధ్రనాయకులు ప్రయత్నింపవలసి యుండును. కేంద్రప్రభుత్వ హోంశాఖకూడ ఏప్రిల్ 1 నుండి ఆంధ్రరాష్ట్రము వ్యవహరింపవచ్చునని అభిప్రాయపడినందున ఈపరతు లన్నింటితో ఆంధ్రరాష్ట్రనిర్మాణ ఉత్తరువు 1950 జనవరి 26 లోపుగ జారీయగుటకు ప్రతిబంధకము లేవియు కన్పించుటలేదు.

## ఫిలింపరిశ్రమ: ప్రభుత్వవైఖరి

అనేక ఇతర పరిశ్రమలవలెనే భారత ఫిలింపరిశ్రమకూడ ఈ దశాబ్దమున ఎక్కువ అభివృద్ధిని సాధించినప్పటికిని, ఆధునికావసరములకు, దేశకాల పరిస్థితులకు, తగ్గట్టుగ పరిణామ మందలేదు. నవీన శాస్త్రపద్ధతులను అనుసరించి సేద్యమును సుకరము చేసుకొనుటకు, పంటను వృద్ధిచేసుకొనుటకు వ్యవసాయదారులు విముఖులుగ నున్నట్లే ఫిలిం పారిశ్రామికులుకూడ క్రొత్త మార్గములను అనుసరించుటకు అంత సుముఖముగ లేరు. ఫిలిముల పొడవును పరిమితము చేయుటకు ఇటీవల ప్రభుత్వము చేసిన ప్రయత్నములను వీరు ప్రతిఘటించినవిధము చూచిన, తమకు అనుకూలముగ నున్నప్పటికిని, మార్పును వీరు సహింపరని భావింపవలసి యుండును. యథార్థమునకు ఫిలిముల పొడవును పరిమితము చేయుటవలన ఎక్కువ ప్రయోజనమును పొందువారు పారిశ్రామికులే. యుద్ధమునకు పూర్వము ఎట్టి నిబంధనలు లేక వార్తాపత్రికల ప్రచురణ జరుగుచుండెడిది. యుద్ధకాలావసరములనుబట్టి ప్రభుత్వము ప్రచురింపవలసిన పేజీలను, నిర్ణయింపవలసిన ధరలను నిర్ణయించుటవలన పత్రికాపరిశ్రమ నష్టపడుటకు బదులు, స్థిరపడినది. తమ పాఠకులకు అసంతృప్తి కలుగునని గ్రహించియు, వీలునుబట్టియే యజమానులు పత్రికా ప్రచురణను కొనసాగించిరి. ప్రచారము తగ్గుటకు బదులు హెచ్చినవి. ఫిలిం పారిశ్రామికులు ఈ విషయమును గ్రహింపవలసియుండును.

ప్రజల రంజింపచేసి వారి యభిమానమును ఆదరణను పొందకలిగిననే, ఏ పరిశ్రమ అయినను, అందును ముఖ్యముగ ఫిలిం పరిశ్రమ, స్థిరపడి అభివృద్ధి పొందగలదు. కేవలము దీర్ఘ ఫిలిముల ద్వారానే తాము ప్రజల ఆనందపెట్టగలమను పారిశ్రామికుల అభిప్రాయము సరికాదని యుద్ధకాలానుభవము స్పష్టము చేయుచున్నది. కనుక ఫిలింపారిశ్రామికులు అభ్యుదయకరమగు మార్పులను ప్రతిఘటించుటకు బదులు "సంధ్యాకాలము"లో ప్రభుత్వమునుండి పొందవలసిన రక్షణలవిషయమై ఎక్కువ శ్రద్ధ వహించుట మంచిది.

భారతప్రభుత్వము ఇతర పరిశ్రమల విషయములోవలెనే ఫిలిం పరిశ్రమ విషయమునను ఎక్కువ శ్రద్ధ వహించుచున్నది. పరిశ్రమ విషయమై సమగ్ర విచారణ జరిపి పరిశ్రమ అభివృద్ధికి మార్గములను సంస్కరణకు సూత్రములను సూచించుట కొరకు విచారణసంఘమును నియమించినది. ఈ విచారణ సంఘము వారొక విపులమైన ప్రశ్నావళిని తయారుచేసి అందుపై ప్రజాభిప్రాయమును సేకరింప సంకల్పించిరి. ప్రభుత్వము ఈవిచారణ సంఘనివేదిక తయారగువరకు వేచియుండక "ఫిలిం సెన్సారు" అధికారమును రాష్ట్ర ప్రభుత్వములనుండి తొలగించి కేంద్రప్రభుత్వము నియమించు ఒక అధికారికి దఖలుపరచుచు ఒక శాసనము చేసెను. ఈ అధికారి వివిధ రాష్ట్రములందు తయారగు ఫిలుములనే విధముగ 'సెన్సారు' చేయునో ప్రభుత్వ శాసనముగాని, శాసనావశ్యకతను వివరించిన మంత్రి దివాకర్ గారి ప్రసంగముగాని ప్రకటింపలేదు. వీరి ప్రసంగమును గమనించిన ఈ విషయమున ప్రభుత్వమునకొక ఖచ్చితమైన యభిప్రాయ మున్నట్లు కన్పించదు. భారత దేశమున అన్ని ప్రాంతములందును తయారగు ఫిల్ములు "సెన్సారు" ఒకేవిధముగ నుండుట యవసరమే. కాని అట్టి నియమములను అమలుజరుపుటలో పారిశ్రామికులను అనవసర వ్యయప్రయాసలకు లోనుచేయరాదు. ఇతర ఏర్పాటులనుగురించి ఒక ఖచ్చితమైన అభిప్రాయము లేనపుడు ప్రభుత్వము ఈ శాసనము విషయమున ఇంత తొందరపాటును ప్రదర్శించుట సమంజసముగ లేదు.

ఫిల్ముల పొడవు, 'సెన్సార్ షిప్' విషయమునేగాక, ఫిల్ము పరిశ్రమకు సంబంధించిన అన్ని విషయములలో ప్రభుత్వము ఒక క్రమ విధానమును అనుసరించి వ్యవహరింపవలసి యుండును. ఫిలిం పరిశ్రమ విచారణసంఘ కృషి ఫలితముగ ప్రభుత్వము అత్యంత శక్తివంతమైన ఈ పరిశ్రమ విషయమున ఒక నిర్దుష్టమైన విధానమును అనుసరింప కలుగునని, ఆ విధానము ఫలప్రదమగుటకు ఫిలిం పారిశ్రామికులు తోడ్పడుదురని ఆశించుచున్నాము.

## స్టాలిన్ 70 వ జన్మదినోత్సవం

### భారతప్రధాని నెహ్రూ శుభాకాంక్ష

### బెర్నార్డ్‌షా సందేశం

న్యూఢిల్లీ, డిసెంబరు 20: ప్రధానమంత్రి పండిత నెహ్రూ రేపు 21 వ తేదీని వచ్చే స్టాలిను జన్మదినోత్సవానికి అభినందనం పంపిస్తూ ఇలాగ అన్నారు. "నా ప్రజల తరపున, నా తరపున మీకు జన్మదినోత్సవ సందర్భంలో శుభాభినందనాలు పంపిస్తూ, మీకు చిరకాలం ఆయురారోగ్యం కలగాలని ఆశిస్తున్నాను."

ఈ శుభాభినందనం హిందీ భాషలో పంపించబడింది.

### బెర్నార్డ్‌షా అభినందనాలు

లండన్, డిసెంబరు 20: ఈ వేళ కమ్యూనిస్టు దినపత్రిక డైలీ వర్కర్ బెర్నార్డుషా స్టాలిను 70 వ జన్మదినోత్సవ సందర్భంలో పంపించిన అభినందన లేఖా చిత్రం ప్రకటించింది. "92 వ ఏట 'సాధ్ప్రపంచానికంతటికీ ప్రఖ్యాతులైన నాటక కర్త" అని ఈ పత్రిక షాను గురించి వ్రాసింది. బెర్నార్డుషా స్టాలిన్ కు పంపిన అభినందన లేఖలో ఇది. "70వ జన్మదినోత్సవ సందర్భంలో మీకు అభినందనాలు పంపిస్తున్నందుకు మేమెంతో గర్విస్తున్నాము. మీరు అభ్యుదయ కరమైన మానవజాతికి ఇంకా చాలా కాలం వరకు సేవచేస్తూ ఉండగలరని ఆశిస్తున్నాము."

## వచ్చే 15-వతేదీ లోపుగా పార్లమెంటు ఉప ఎన్నికల సమాప్తి

### రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వాదేశం

న్యూఢిల్లీ, డిశంబరు 20: జనవరి 26 నాటికి ఇండియన్ పార్లమెంటులో ఖాళీ అయ్యే స్థానాలకు ఉపఎలక్షనులు జనవరి 15 తేదీలోగా పూర్తి కావాలని కేంద్రప్రభుత్వం రాష్ట్రాలకు, సంస్థానాలకు ఆదేశాలు పంపించింది.

1950 జనవరి 26వ తేదీనాటికి 121 స్థానాలు పార్లమెంటులో ఖాళీ అవుతాయి. ఇందులో ఎక్కువ స్థానాలు యు. పి. కి చెందినవి.

తిరువాన్కూరు కొచ్చి సమాఖ్య నుంచి పార్లమెంటుకువచ్చిన సభ్యులంతా రాజీనామా చేయవలసి వుంటుంది. వీరికి ఇటు పార్లమెంటులోను, అటు సంస్థాన శాసన సభలోనూకూడా సభ్యత్వంవుంది.

ఈ విధంగా రాజీనామా పెట్టవలసిన వాళ్లు యు. పి. లో 25 మందిన్నీ, బీహారులో 24 మందిన్నీ, మదరాసులో 20 మందిన్నీ, బొంబాయిలో 10 మందిన్నీ, మధ్య రాష్ట్రాలలో 10 మందిన్నీ, ఒరిస్సాలో 6 గురున్నూ, అస్సాంలో 6 గురున్నూ, పశ్చిమ బెంగాల్లో 2 రున్నూ వున్నారు.

ఇందులో 17 మంది ముస్లింలు, 16 మంది నిమ్న జాతులకు చెందిన వాళ్లు.

కాంగ్రెస్ లెజిస్లేటివ్ పార్టీల సహాయం తీసుకుంటూ ప్రొ కాంగ్రెస్ కమిటీలు ఈ స్థానాలకు ప్రతినిధులను నిర్ణయిస్తారు.

## సినిమా చిత్రాల సెన్సార్షిప్: అధికార కేంద్రీకరణ

### సినిమటోగ్రాఫు సవరణ బిల్లుకు భారత పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ, డిసెంబరు 20: నేడు భారత పార్లమెంటువారు సినిమాచిత్రాల సెన్సార్షిప్ కేంద్రీకరించే సినిమటోగ్రాఫు (రెండవ సవరణ) బిల్లును ఆమోదించి ఢిల్లీ భవనాల (సేకరణ, నిర్వహణ) చట్టాన్ని మరి మూడేళ్లు పొడిగించారు.

అక్రమంగా ప్రభుత్వ నివాసాలను ఆక్రమించి ఉన్న 1389 మందిని 1950 మార్చిలోగా పంపివేస్తారనీ, సాధ్యమైనంతవరకు వీరికి ఇతర నివాసాలు చూపబడతవనీ గనులమంత్రిగాడ్గిల్ తెలిపారు.

అవసర సప్లయిలచట్టాన్ని, ఇళ్ల సేకరణచట్టాన్ని మరొక సంవత్సరం పొడిగించడానికి సభ ఆమోదించింది.

కంట్రోళ్లు మరి అయిదేళ్లదాకా రద్దుకావనీ, అవి ఏవిధంగా అమలు జరుగుతున్నదీ విచారణచేయాలనీ ఆచార్యరంగా అన్నారు.

1918 సినిమాటోగ్రాఫ్ చట్టంమీద నేడు పార్లమెంటులో చర్చసాగింది. పార్లమెంటు చర్చించే బిల్లులోని 6 వక్లాజు ప్రకారం సినిమా చిత్రాల సెన్సారు నిమిత్తం ఒక కేంద్రకమిటీ ఏర్పాటు చేయబడనున్నది. ఈ విషయం మాట్లాడుతూ సి. సుబ్రహ్మణ్యం, ఈ కమిటీలో ఎవరుంటారన్న ప్రశ్నకు మంత్రిగారు విస్పష్టమైన సమాధానం ఇవ్వలేదనీ, ప్రధాన సెన్సారుకు అధికారాలన్నీ ఇచ్చినట్లయితే అధికార దుర్వినియోగానికి అవకాశం ఉంటుందనీ అన్నారు.

దీనిపై సమాధానం చెబుతూ ...మంత్రి ఆర్. ఆర్. దివాకర్, ప్రధాన సెన్సారుతోబాటు సలహాదార్ల సంఘం వారు అధికారాలను పంచుకొంటారని అన్నారు. శ్రీమతి దుర్గాబాయి ప్రశ్నకు సమాధానంగా, సలహాదార్లను గురించి ఇప్పుడు వివరాలివ్వజాలననీ, వారు దేశమంతటి నుంచీ తీసుకొనబడతారనీ అన్నారు.

మహావీర్ త్యాగి మాట్లాడుతూ, సినిమా చిత్రాల ద్వారా నిర్దుష్టమైన వినోదమూ, విజ్ఞానమూ లభించగలందులకు సెన్సార్షిప్ కేంద్రీకరించబడుతున్నదని చెప్పబడిందనీ, ప్రభుత్వం ఈ ఆశయాన్ని ఏ విధంగా సాధించదలచిందో, ఎటువంటి ఆర్థిక, వైజ్ఞానిక విధానాలు ప్రచారం చెయ్యగోరుతున్నదో తెలుసుకో గోరుతున్నాననీ అన్నారు. దేశంలో ఉత్పత్తి అయే సంపదకు ఎక్కడా అందని జీవనప్రమాణాలను సినిమా చిత్రాలు ప్రచారం చేస్తున్నవి. ప్రధాన సెన్సారు అధికారిగా ఎవరుంటారో తెలియదు. సినిమా చిత్రాలు పాశ్చాత్య నాగరికతను ప్రచారం చేయడంకంటె ఉన్నతాదర్శాలూ, సరళ జీవనమూ ప్రచారంచేస్తే బాగుంటుంది. సినిమాచిత్రాలలో కవిత్వమూ, సంగీతమూ ధ్వంసంచేయబడుతున్నది ఈ లోపాలను సెన్సారు సలహాదార్లు పరిచేయాలని త్యాగి అన్నారు.

సభ్యులు చేసే సూచనలను ప్రభుత్వం సగౌరవంగా గమనిస్తుందని దివాకర్ చెప్పారు.

బిల్లు ఆమోదించబడింది.

## పఠాన్ల స్వాతంత్ర్య విప్లవం

### ఢిల్లీలోని ఆఫ్ఘన్ రాయబారి ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 20: ఆఫ్ఘనిస్థాన్ రాయబారి సర్దార్ నజీమ్ ఉల్లాఖాన్ ఈవేళ పత్రికా విలేఖరుల సభలో ప్రసంగిస్తూ, వాయవ్యరాష్ట్రంలోను, బెలూచిస్థాన్ లోనువున్న పఠానుల పరిస్థితులు చాలా కల్లోలంగా వున్నాయనీ, ఈ కల్లోలాలు క్రమక్రమంగా మధ్యప్రాచ్య భద్రతకే చాలా ముప్పు తీసుకురావచ్చుననీ అన్నారు.

ఆఫ్ఘను రాయబారి ఇంకా ఇల్లాగ అన్నారు. "రెండు ప్రపంచయుద్ధాలు ప్రపంచాన్ని సర్వనాశనం చేశాయి. ఐక్యరాజ్య సమితిలోని పెద్దపెద్ద రాజ్యాలన్నీ తాము శాంతికోసమే ప్రయత్నిస్తున్నామని అన్నారు. అప్పైన ఐక్యరాజ్య సమితి ప్రణాళికకూడా ఉన్నది. అయినా కొన్ని దేశాలింకా, న్యాయంకంటె శక్తి గొప్పదని భావిస్తున్నవి. ఈ దేశాలు ఐక్యరాజ్య సమితి ప్రణాళికను దళితదేశాలకు అనువర్తింపజెయ్యడానికి వెనకాడుతున్నాయి.

బ్రిటిషువారు 70 ఏళ్ళపాటు ఎంతగా ప్రయత్నించినా ఆఫ్ఘన్ పఠానుల అణచివెయ్యలేక పోయారు. ఎంతగా అణచివెయ్యదలచుకున్నా, నానాటికీ వారి ఉద్రేకం ఇనుమడిస్తూనే యున్నది. పాకిస్తాన్ ఈ విషయంలో ఐక్యరాజ్యసమితి ప్రణాళికను అక్షరాలా అనువర్తిస్తే, అది పాకిస్థానుకే లాభకరము. అఫ్ఘను ప్రభుత్వం ఈవిషయం పాకిస్థానుతోను, బ్రిటనుతోను సంప్రతించి ఒక పరిష్కారానికి రావాలని చూసింది. కాని ప్రయోజనం ఏమీలేకపోయింది. పఠానుజాతిఅంతా ఇప్పుడు నిష్పక్షదృష్టితో పురోగమిస్తున్నదని ... టిస్తూ అఫ్ఘను రాయబారి ఇంకా ఇలాగ అన్నారు."

పాకిస్తాన్ దినదినము, పత్రికలలోను రేడియోలలోనూ, పఠానులలో స్వాతంత్ర్యోద్యమం ఏమీలేదని అసత్యాలు ప్రచారం చేస్తున్నది. కాని ఈ యథార్థ విషయాన్ని పాకిస్తాన్ కప్పిపుచ్చలేని రోజులు సమీపిస్తున్నాయి."

ఈ విషయంలో అఫ్ఘను రాయబారి ఇంకా ఇల్లాగ చెప్పారు. "ఆంగ్ల ప్రభుత్వం ఈ దేశంలో తన అధికారం విసర్జించి వేసినరోజున, పఠానులను వట్టి సరకులమోస్తరుగా పాకిస్తాన్ కాతాలో జమకట్టివేసింది. ఈ విధంగా అన్యాయం చెయ్యడం వల్లే ఫక్తూను జాతిలో పెద్ద కల్లోలం బయలుదేరింది. వాయవ్య రాష్ట్రంలోను బెలూచిస్థాన్ లోను, కొండజాతుల ప్రదేశాలలోను, అఫ్ఘనిస్థాన్ లోను, ఈ ఉద్యమం చాలా తీవ్రంగా వ్యాపించింది. ఈ కల్లోలం క్రమక్రమంగా మధ్య ప్రాచ్యదేశాల భద్రతకే ముప్పు తెచ్చేదిగా కూడా పరిణమించవచ్చును. ఈ సంగతి కనిపెట్టి అఫ్ఘను ప్రభుత్వం ఫక్తూను జాతివారికి స్వయం నిర్ణయ స్వాతంత్ర్యం ఉండాలని ప్రతిపాదించింది. కాని అఫ్ఘను ప్రభుత్వ ప్రయత్నాలు ఫలించలేదు. ఇన్నాళ్లనించీ సాయుధులైన ఫక్తూను జాతి వారితో మేము తొందరపడవద్దని చెప్పాము. కాని పాకిస్థాన్ తోను ఆంగ్ల ప్రభుత్వంతోను జరిపిన సంప్రతింపులు ఫలించక పోవడంవల్లను పఠానులు తొందర పడుతూండడం వల్లను మేము చాలా ఇరుకులో పడిపోయాము. ఈ సాయుధులైన అఫ్ఘనులు 40 లక్షల దాకా ఉన్నారు. రెండేళ్లనుంచి మేము వీరిని తొందర పడవద్దని చెబుతున్నాము.

అఫ్ఘను రాయబారి ఇంకా ఈ విషయం ఇల్లాగ అన్నారు. ఈ ఫక్తూనిస్థాన్ ఆందోళన అఫ్ఘనిస్థాన్ లేవదీసినదే అని పాకిస్థాన్ అంటున్నది. అయితే నేను పాకిస్థాన్ ను ఈ విషయంలో కొన్ని ప్రశ్నలు అడగదలచి ఉన్నది. బాబరా ధార్సదాలలో వందలాదిగా జనాన్ని చంపివెయ్యడం యెందుకు జరిగింది? వాయవ్య రాష్ట్రంలో అనేకచోట్ల తుపాకులు పేల్చవలసిన అవసరం ఎందుకు కలిగింది? దీనివల్ల వాయవ్య రాష్ట్రంలో అనేక మంది స్త్రీలు, పిల్లలు తమ ప్రాణాలు కోల్పోయారు. ఈ కాల్పులన్నీ యెందుకు జరిగాయో పాకిస్తాన్ ప్రభుత్వం ప్రపంచానికి తెలియజెయ్యవలసి ఉన్నది.

అఫ్ఘను రాయబారి తమ ఉపన్యాసం ముగిస్తూ ప్రపంచంలోని ప్రభుత్వాలన్నీ ఈ విషయాలన్నీ ఎంతో సానుభూతితో అవగాహన చేసుకోవాలనీ, ఈ జాతి స్వాతంత్ర్య సంపాదనకు సహాయం చెయ్యాలనీ చెప్పారు.

## సంక్రాంతికే ఆంధ్ర రాష్ట్రం

(1-వ పేజీ తరువాయి)

ఆంధ్రరాష్ట్రమును సంక్రాంతి కానుకగా అందింపచేదరా లేక సంవత్సరాది కానుకగా సమర్పింపచేదరా అని ఆంధ్రపత్రిక ప్రతినిధి శ్రీ వెంకట్రావు గారిని అడుగగా తమపంట ఎప్పుడూ సంక్రాంతికేనని. కేంద్రప్రభుత్వ హోంశాఖవారి రెండవ లేఖను చూచిన అనంతరంకూడా జనవరి 26 కు రాష్ట్రము రాగలదని చెప్పగలరా అని శ్రీ వెంకట్రావుగారిని అడుగగా "జనవరి 26 కే రాగలదని నా విశ్వాసం. భారతీనాయకుల ఆశీస్సులు ఉన్నవి. దైవం అడ్డుపడితేతప్ప జనవరి 26 కు రావడానికి ఢిల్లీలో సర్వ యత్నాలుచేశాము. ఇక్కడకూడా చేస్తున్నాము" అని వెంకట్రావుగారు తెలిపిరి.

జనవరి 26 కు రాకపోతే మార్చిలో బడ్జెటు సమావేశం ఉన్నందున ఏప్రిల్ 1 వ తేదీకి ఆంధ్రరాష్ట్రము వచ్చుట తమకు సందేహముగా ఉన్నదనిరి.

శ్రీ వెంకట్రావుగారు ప్రభుత్వ అతిథి గృహమున బసచేసినపుడు కొందరు మిత్రులు సందర్శించి జనవరి 26 వ తేదీకి రాష్ట్రం వస్తుందనే ఆశాకిరణం ఉన్నదా అని ఒకరు అడుగగా "ఒక్క కిరణమేమిటి? భాగ్యజ్యోతి మనకు పూర్ణంగా కనిపిస్తూండగా" అని సమాధానమిచ్చిరి. రాజధాని హైకోర్టులగూర్చి నిర్ణయించుటకు ఆంధ్ర శాసనసభ్యుల నాయకుల సమావేశం జరుగగలదని వెంకట్రావుగారు తెలిపిరి.

## "లోటు కోటీ 40 లక్షలు మాత్రమే"

### ఆర్థికోపసంఘ నివేదికాంశాలు

ఆర్థిక ఉపసంఘంవారు నూత్న ఆంధ్ర రాష్ట్రానికి పాలీసా బడ్జెట్‌లో కోటి 80 లక్షలు లోటు రాగలదనీ, ఇంకో విధంగా చూస్తే, ఆ లోటును కోటి 40 లక్షలకు తగ్గించవచ్చుననీ, మొదటి రోజులలో రివర్స్యూ రిజర్వ్ నిధినుండి దాన్ని సర్దుకొనవచ్చుననీ, త్వరలోనే ఆంధ్ర రాష్ట్రం స్వయంపోషకము కాగలదనీ, వివరములన్నీ తెలుపుచూ 30 పేజీల నివేదికను విభజన సంఘంవారికి సమర్పించినట్లు తెలుస్తున్నది. తామిచ్చిన వివరములు జనవరి 26 తేదీకే ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించడానికి సమగ్రంగా ఉన్నవనీ, ఏమైనా కొద్ది హెచ్చు తగ్గులుంటే, తర్వాత సవరించుకోవచ్చుననీ కూడా ఇదే నివేదికలో తెలిపిరి.

ప్రభుత్వ శాఖలను 11 నుంచి 7 కు తగ్గించి, 7 గురు కార్యదర్శులతో రాష్ట్రాన్ని నిర్వహించుకోవచ్చునని, అధికార వర్గాలవారు అంటున్నారు. ఆంధ్రరాష్ట్రంలో బియ్యంపంట మిగులు వుండుననీ, జొన్నలు స్వయం సమృద్ధమగుననీ, ప్రభుత్వంవారు లెక్కలు తెలుపుతున్నవి.

మూడు, నాల్గు రోజులలో విభజన సంఘ కార్యకలాపాన్ని ముగించడానికి శరవేగంతో కార్యకలాపాలు సాగిస్తున్నామని ఒక విభజన సంఘ సభ్యుడు ఆంధ్రపత్రిక విలేఖరికి చెప్పారు.

రాజధాని, హైకోర్టువిషయంలోకూడా పేచీ అనవసరమనీ, శ్రీబాగ్ ఒడంబడికను ఆంధ్రనాయకులు త్రికరణశుద్ధిగా పాలిస్తారనీ అందునిమిత్తమై కొద్ది రోజులలోనే రాయలసీమ శాసన సభ్యులు, రాయలసీమలోని రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులు ఒకసారి సమావేశపరచనున్నామనికూడా తెలిపిరి. ఆ సమావేశం వారు శ్రీ బాగ్ ఒడంబడికను అనుసరించి రాజధానినో హైకోర్టునో వరించగలరనివుండును. ఈ కార్యక్రమంలో రాయలసీమ వారు యావదాంధ్రదేశ క్షేమ సౌభాగ్యాలనూ కష్టసుఖాలను, మనసులో వుంచుకోగలరనీ, రాయలసీమలో రాజధాని వుంచమనుటకు ఆ కోస్తానవున్న శ్రీ కాళహస్తివారికి మరీ బాధ అయినచో ఆంధ్రదేశానికి మధ్యస్తంగా వున్న విజయవాడ ప్రాంతంలో రాజధాన్ని వుంచడానికి తమకు అభ్యంతరం లేదనీ ఒక రాయలసీమనాయకుడు తెలియజేశారు. హైకోర్టును రాయలసీమకు ఇస్తే, విశ్వకళాపరిషత్తుకు సంబంధించిన కొన్ని సాంకేతిక అనుబంధ కళాశాలలను రాయలసీమలో పెట్టాలనివుంటుదనీ, ఇవి రాయలసీమవారికి ఇష్టమై వుండుననీ తెలిపిరి.

కృష్ణా, ప. గోదావరి, గుంటూరు మూడు జిల్లాలలోనే దావాలసంఖ్య అపరిమితముగా వున్నదనీ, అందువల్ల సర్కార్లవారు హైకోర్టునుపెట్టుకున్నచో, వారికే క్షేమమనీ కాని ఈ విషయమై తాము మంకుపట్టు పట్టదలచలేదనీకూడా ఈనాయకుడు తెలియచేశాడు.

రాయలసీమ నాయకులు సర్కారు నాయకులు నగరములో వున్నవారు ప్రత్యేక ప్రత్యేకముగా కేడోకేపో ఈవిషయమై స్నేహ సుహృద్భావ వాతావరణములో సంప్రతింపులు జరుపనున్నారు.

## అపహృత స్త్రీల పునరుద్ధరణ

### బిల్లుకు పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ, డిసెంబరు 19: గేశంలో ఉన్న అపహృత ముస్లిం స్త్రీల ఉద్ధరణకై గోపాలస్వామి అయ్యంగార్ ప్రతిపాదించిన బిల్లును పార్లమెంటు నేడు ఆమోదించింది.

ఈ బిల్లు శాసనమైనప్పుడు ఎంతకాలం అమలులో ఉండేదీ ఒక గడువుతేదీ నిర్ణయించాలని శ్రీమతి దుర్గాబాయి ప్రతిపాదించిన సవరణ ఆమోదించబడ్డది 1951 అక్టోబర్ 31 వరకూ ఈ శాసనం—బిల్లు ఆమోదించబడితే—అమలుజరగాలని నిర్ణయించబడినది. అపహృత స్త్రీలను వ్యక్తికి వ్యక్తిపద్ధతిలో పాకిస్థాన్‌తో మార్పుచేసే విషయమై బిల్లు ఉపోద్ఘాతంలో సూచించాలని సర్దార్ భూపేంద్ర సింగ్ మాన్ చేసిన సూచన క్రమవిరుద్ధమని అధ్యక్షుడు త్రోసివేశాడు.

పాకిస్థాన్‌లో కొన్ని ప్రాంతాలలో ఉద్ధరణపని జరగకూడదని కూడా నిషేధించబడ్డదనీ, హిందూ, సిక్కు అపహృత స్త్రీలను ఉద్ధరించే విషయమై ప్రభుత్వం హామీ ఇవ్వాలనీ, ఈ అంశాన్ని ఇంతవరకూ ఐక్యరాజ్యసమితికి యెందుకు ఉదహరించలేదో తెలుసుకొన గోరుతున్నాననీ ఆయన అడిగాడు.

చర్చకు గోపాలస్వామి అయ్యంగార్ సమాధానమిచ్చినమీదట బిల్లు ఆమోదించబడ్డది.

పాకిస్థాన్‌లో రిజిస్టరు అయినదీ నౌకల మీద పన్ను వేసే అధికారాన్ని పశ్చిమ బెంగాల్ ప్రభుత్వానికిస్తూ ఒకబిల్లు ఆమోదించబడ్డది.

### సినిమాల చట్టసవరణ బిల్లు

అనంతరం సినిమాలచట్ట సవరణబిల్లుపై చర్చ జరిగినది. ఆర్. కె. సిధ్వా, హెచ్. వి. కామత్, సర్దార్ భూపేంద్రసింగ్ ప్రభృతులు బిల్లులో ప్రతిపాదించబడ్డ కేంద్రసెన్సార్ సంస్థను విమర్శించారు.

ఫిల్ములు మరీ పాడుగైనవనీ, భారతీయ సాంప్రదాయానికది విరుద్ధంగా ఫిల్ములు పోటీ పడి ప్రేమఘట్టాలను చూపుతున్నవనీ సభ్యులు విమర్శించారు.

ప్రచార శాఖా సహాయమంత్రి కేంద్ర సెన్సార్ సంస్థను వర్ణిస్తూ కేంద్రసెన్సార్ ఉంటుందనీ, మద్రాసు, బొంబాయి, కలకత్తాలలో మూడు డిప్యూటీ సెన్సార్ సంస్థలు ఉంటవనీ, వీటికి సలహాసంఘాలుంటవనీ, తుదినిర్ణయాధికారం కేంద్ర సెన్సారుదేననీ అన్నారు.

నేడు సభ ముగిసేటప్పటికి చర్చ పూర్తి కాలేదు.

## హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లు

### ఢిల్లీ ప్రత్యేక ప్రచారంఏర్పాట్లు

న్యూఢిల్లీ డిసెంబరు 19: హిందూధర్మశాస్త్ర క్రోడీకరణబిల్లు ఉద్దేశ్యాలను, క్రోడీకరణ కారణాలను, ఢిల్లీ పౌరులకు, విశదీకరించుటకు 200 మంది కాంగ్రెస్ కార్యకర్తలు గతరాత్రి సమావేశమై తీర్మానించుకొన్నారు.

ఈ బిల్లుకు వ్యతిరేకులైన వారు నగరంలో దౌర్జన్య ప్రపూరితమైన ప్రదర్శనలు జరుపుచుండుటచే, బిల్లు ఉద్దేశ్యాలను ప్రజలకు వివరించి బిల్లును ప్రతిఘటించ దలచిన వారు అహింసా పద్ధతుల నవలంబించవలసిన అవసరమును ఎరిగించుటకు గాను, వీరి తీర్మానం చేసుకొన్నారు.

## పంటలకు పశువులకు భీమాపద్ధతిపెట్టాలి

### కిసాన్‌కాంగ్రెస్ తీర్మానం

న్యూఢిల్లీ, డిసెంబర్ 19: కిసానుజీవితంలో, ఆర్థిక సాంఘిక స్థితిగతులను అభివృద్ధి చేయుటకు కిసాన్‌కాంగ్రెస్ పనిచేయాలని భారత కిసాన్ కాంగ్రెస్ గతరాత్రి తీర్మానించింది. భారత కిసాన్ కాంగ్రెస్ రెండురోజుల సమావేశములుగత రాత్రితో సమాప్తిఐయినవి.

ఈ సమావేశములలో దాదాపు 100 మంది ప్రతినిధులు హాజరైనారు. జిల్లా, తాలూకా కిసాన్ కాంగ్రెస్ సంఘాలను, రాష్ట్ర కిసాన్ కాంగ్రెస్‌లను, "కిసాన్ సమితు"లని పేరుమార్చుటకు గూడ సమావేశంలో నిర్ణయింపబడింది.

ప్రతి గ్రామంలోనూ, ప్రతిజిల్లాలోను ఆహారోత్పత్తి సమితులను నెలకొల్పవలసినదని, ఆహారోత్పత్తిలో ప్రాపీఇత్తి చూపిన కిసాన్‌లకు బహుమతులిచ్చే పద్ధతిపెట్టాలని నివిధవ్యవసాయ పరిశోధక సంస్థలలో జరిపిన పరిశోధనాఫలితాలను రైతులకు తెలుపుతూ తరచు ప్రదర్శనలను ఏర్పాటు చేయాలని, అనావృష్టి, వరదలబాధ, పసు రోగములు వీటివల్ల రైతులనష్టపడకుండా పంటలకు పసువులకు భీమా పెట్టవలెనని, రాష్ట్రప్రభుత్వాలను కోరుచూ తీర్మానములు చేయబడెను.

## భారత విమానదళ కొత్త సర్వసేనాని

### ఏర్‌వైస్‌మార్షల్ ఛాప్మన్ నియామకం

న్యూఢిల్లీ, డిశంబరు 19: భారతవైమానికదళ సర్వసేనానిగా బ్రిటిష్ వైమానిక దళానికి చెందిన ఏర్ వైస్ మార్షల్ రానల్డ్ ఇవ్లీ-ఛాప్మన్‌ను నియమించారు. ఈయన ఈపదవిని స్వీకరించటానికి బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించిందని భారత రక్షణమంత్రి కార్యాలయం వెలడించింది. తాత్కాలిక ఏర్‌మార్షల్ హోదాతో ఫిబ్రవరిలో ఈయన కొత్తపదవిని స్వీకరించనున్నాడు.

1947 అగస్టు 15 నుంచీ సర్వసేనానిగా ఉన్న ఏర్ మార్షల్ సర్ థామస్ ఎల్మ్‌హర్స్ట్ రిటైరు కాగోరినందున ఇవ్లీ-ఛాప్మన్‌ను నియమించవలసివచ్చింది.

ఇవ్లీ-ఛాప్మన్ 1899 లో జన్మించాడు. 1917 లో బ్రిటిష్ వైమానికదళంలో చేరాడు. 1918 ఫ్రాన్సు రంగంలో డి. ఎఫ్. సి. బిరుదును పొందాడు రెండో యుద్ధం ప్రారంభమయేటప్పటికి బాంబర్ దళ కేంద్ర కార్యాలయ ప్రధానోద్యోగిగా ఉండి 1948 వరకూ వివిధ హోదాలలో పనిచేసి, 1948 లో బ్రిటిష్ విమానమంత్రి కార్యాలయంలో ప్రభుత్వ వైమానికవిభాగ డైరెక్టరయినాడు. 1944 ఫిబ్రవరిలో బాంబర్ దళానికి నాయకత్వం వహించి ఫ్రాన్సుమీదకి వెళ్లగా ఈయన విమానం కూల్చివేయబడ్డది. ఈయన అందులోనుంచి మాకి తప్పించుకున్నా నెలరోజుల తరవాతమళ్లీ పట్టుబడ్డాడు. 1945 ఏప్రిల్‌లో మిత్రరాజ్య సేనలు ఖైదునుంచి విడిపించినవి.

అనంతరం ఒక ఏడాదిపాటు రక్షణ పరిశోధన సంఘంలో పనిచేసి ఇప్పటి వరకూ సామ్రాజ్యరక్షణ కళాశాలలో విమానశాఖ అధ్యాపకుడుగా ఉంటున్నాడు.

1928-29 సం॥లలో కాబూల్‌పై జరిగిన చర్యలలో ఏర్‌ఫోర్స్‌క్రాస్ బహూకరించబడ్డాడు.

## ఆత్మహత్యను చట్టబద్ధంచేయడానికి బిల్లు

### హెచ్. వి. కామత్‌గారి ప్రయత్నం

న్యూఢిల్లీ, డిశంబరు 20: ఆత్మహత్యను న్యాయబద్ధం చేయాలని కోరుతూ తాను తీసుకువచ్చిన బిల్లును వచ్చే పార్లమెంటులో ప్రతిపాదించగలనని శ్రీ కామత్ నేడొక ప్రకటన చేసారు.

ఆబిల్లును ప్రవేశపెట్టడానికి ప్రస్తుతం పార్లమెంటు అనుమతి ఇవ్వలేదు.

ఆ విషయాన్ని వెల్లడిచేస్తూ ఆయన ఇవ్వాళ ఒకప్రకటన చేసారు.

ఆ ప్రకటనలోని ముఖ్య విషయాలు బిల్లును ప్రవేశపెట్టకుండానే ప్రతిఘటించే అధికారం ఇదివరకు లేదు. ఇప్పుడు నా బిల్లును ప్రవేశపెట్టనీయక పోవడంతో ఏర్పడింది. అదీకాకుండా బిల్లు మంచిదో చెడ్డదో తేలాలంటే చర్చ జరగాలి: అటువంటిదికూడా ఏమీ జరగలేదు. దీన్ని ప్రవేశపెట్టనీయడమా, పెట్టనీయక పోవడమా అన్న విషయంమీద ఓటింగు తీసుకుంటే అనుకూలంగా 7 గురు మాత్రమే వున్నారని సభాధ్యక్షులు ప్రకటించారు గాని, వ్యతిరేకంగా ఎంతమంది ఓటు చేసారో చెప్పలేదు. ఈ అన్ని కారణాలను పురస్కరించుకొని ఈ బిల్లును వచ్చే పార్లమెంటులో తిరిగి ప్రవేశపెట్ట దలచుకున్నాను.

## సూడాన్ పత్తి కొనుగోలు

### సంప్రదింపులు ప్రారంభం

న్యూఢిల్లీ, డిసెంబరు 19: సూడాన్ పత్తిని, భారీ మొత్తంగా ఇండియన్ మిల్లులకోసం కొనేవిషయమై ఖార్టూంలో సంప్రదింపులు ప్రారంభమైనవని యిక్కడ తెలియవచ్చింది.

యుద్ధానికి పూర్వం, సూడాన్ పత్తి, క్రయంలో ఇండియా ఖాతాదారు.

భారతప్రభుత్వ వాణిజ్యశాఖా సంయుక్త కార్యదర్శి కె. కె. చెట్టూర్ నాయకత్వాన తూర్పు ఆఫ్రికాకు వెళ్లిన భారతప్రతినిధివర్గం యీ సంప్రదింపులకు పూనుకొన్నది. తూర్పు ఆఫ్రికాపర్యటన ముగించుకొని ఢిల్లీరాగానే చెట్టూర్ ఖార్టూం వెళ్ళారు

తూర్పుఆఫ్రికా పత్తిపంటలో ఇండియా వాటాకు 218000 బేళ్ళను సంపాదించాలని చెట్టూర్ ప్రతినిధివర్గం ప్రధానోద్దేశ్యం. మిగతాపంట బ్రిటన్‌కు వెడుతుంది.

ఇండియా నార వస్తువులను తూర్పు ఆఫ్రికాకు సప్లైచేసే విషయంగూడా నైరోబీలో భారతప్రతినిధివర్గం సంప్రదించినట్లు తెలుస్తున్నది.

## ఫ్రెంచి ఇండియాలో ఓటర్ల జాబితాల సవరణ

### కమిషనరు ఉత్తరువు ననుసరించి నేడుప్రారంభం

పుదుచ్చేరి, డిశంబరు 20: ముందు జరుగనున్న జనవాక్య నిర్ధారణకు గాను ఫ్రెంచిభూభాగములలో వోటర్లపట్టికలను సవరించుకార్యక్రమము ఫ్రెంచికమిషనర్ చాంబన్ ఉత్తరువుననుసరించి నేటి ఉదయము 9 గంటలకు యిచ్చుటప్రారంభమయ్యెను. పుదుచ్చేరి, కరైక్కాల్, మాహే, యానాములలో ఓటర్లపట్టికలను సవరించు కార్యకలాపములను నేటినుండే ప్రారంభింపవలెనని కమిషనరు ఉత్తరువు గావించియున్నాడు. ఈ పనిని పూర్తి చేయవలసిన నేడితకుచాతని ర్ణయింపబడును ఈ పనినిర్వహించుటకు మేయరు ఒకమునిసిపల్ కమిషనరు, ప్రభుత్వ ప్రతినిధితో కూడిన ఒకకమిషనును ఏర్పాటు చేసియున్నారు.

## వాల్తేరులో భారతీయ ఆర్థిక మహాసభ

న్యూఢిల్లీ, డిసెంబరు19: భారతీయఆర్థిక మహాసభ 32 వ సమావేశం ఆంధ్రవిశ్వకళాపరిషత్ ఆధ్వర్యాన వాల్తేరులో డిసెంబరు 26 27, 28, వ తేదీలలో జరుగుతుంది. ఢిల్లీ విశ్వకళా పరిషత్తుకు చెందిన ప్రొఫెసర్ డా॥ వి. కె. ఆర్ వి. రావుగారు అధ్యక్షత వహిస్తారు. అధిక ద్రవ్యచలామణీ, భారతద్రవ్య విధానం, రూపాయి విలువతగ్గింపు మొదలైన విషయాలపై చర్చలు జరుగుతాయి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ఎన్. జి. రంగా సమావేశాన్ని ప్రారంభిస్తారు.

### రాష్ట్ర ఆహార సలహాసంఘ సభ్యత్వం

మదరాసు ప్రభుత్వమువారు శ్రీ జి. సన్యాసిరావు యం. యల్. ఏ. గారిని చెన్నరాష్ట్ర ఆహార సలహాసంఘమునకు అదిషనల్ సభ్యుడుగా నియమించియున్నారు.

# కమ్యూనిస్టు రేవులపై జాతీయ చైనా దిగ్బంధం

## అమెరికాకు కొమింటాంగ్ ప్రభుత్వ హెచ్చరిక

వాషింగ్టన్, డిసెంబరు 19: చైనా కమ్యూనిస్టుల అధీనంలో ఉన్న రేవులపై దిగ్బంధాన్ని ధిక్కరించుటకు ప్రయత్నించే విదేశనౌకలు మందుగుండులవల్ల గాని, తదితర చర్యలవల్లగాని నష్టపడితే, నష్టానికి పూచీ అంతా ఆ నౌకలవారిదేనని చైనా జాతీయప్రభుత్వం అమెరికాకు హెచ్చరిక చేసింది. ఈ హెచ్చరికచేస్తూ డిసెంబర్ 12 వ తేదీన, జాతీయచైనా అధికారులు, షాంఘాలోని అమెరికన్ కౌన్సల్ జనరల్ కు లేఖపంపారు. ఈ లేఖ పూర్తిపాఠం అమెరికా విదేశాంగ శాఖవారికింకా చేరలేదు.

కొంతమంది విదేశవ్యాపారస్థులు, దిగ్బంధాన్ని ఉల్లంఘించారని, కొంతమంది నష్టానికి గురియైనారనికూడా, యీ లేఖలో తెలుపబడింది.

చైనాప్రభుత్వం యీ లేఖ పంపినప్పటికి, దిగ్బంధం చట్టవిరుద్ధమైనదను అభిప్రాయం అమెరికా మార్చుకోదు అని విదేశాంగ శాఖాధికారులు చెప్పారు.

ప్రస్తుతం అమెరికా వ్యాపారనౌకలేవీ చైనా సముద్రప్రాంతంలో లేవని తెలుస్తున్నది.

### బ్రిటిష్ ఆందోళన

కమ్యూనిస్టుల అధీనంలో ఉన్న చైనా కోస్తాలో మందుగుండులను నాటతానని చైనాప్రభుత్వం బ్రిటన్ కు చాలా ఆందోళన కలిగిస్తున్నట్లు, బ్రిటిష్ విదేశాంగ కార్యాలయోద్యోగి ఒకడన్నాడు. చైనా ప్రభుత్వం సంకల్పించిన యీ కొత్తపనివల్ల, పరిస్థితి మరింత విషమరూపం తాల్చవచ్చునని బ్రిటన్ యీ విషయమై తీవ్రంగా ఆలోచించవలసి ఉంటుందని అన్నాడు.

బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ తమ ప్రభుత్వాభిప్రాయాన్ని, లండన్ లోని చైనా రాయబారికి యివ్వాళ నచ్చచెప్పాడట.

## జాతీయచైనా తాత్కాలిక అధ్యక్షునికి శస్త్రచికిత్స

న్యూయార్కు, డిసెంబరు 19: కడుపులో పుండుతో బాధపడుతున్న జాతీయ చైనా తాత్కాలికాధ్యక్షుడు జనరల్ లీరుంగ్ జెన్ యీ వేళ కొలంబియా ప్రెసిబటేరియన్ ఆస్పిటల్ లో శస్త్రచికిత్స పొందాడు. శస్త్రచికిత్సానంతరం ఆయన పరిస్థితి బాగా ఉన్నదని హాస్పిటల్ అధికారులు తెలియజేశారు.

జనరల్ లీరుంగ్ జెన్ డిసెంబర్ 7 వ తేదీన యిక్కడకు వచ్చాడు. త్వరలో నే చైనావెళ్ళి కమ్యూనిస్టులతో పోరాటం కొనసాగింప నిశ్చయించినట్లు ఆయన యిక్కడకు రాగానే అన్నారు.

## బెవిన్ తో చైనా రాయబారి చర్చ

లండన్, డిసెంబర్ 19: లండన్ లో చైనారాయబారి డా॥ చెంగ్ టిన్ సీ బ్రిటిష్ప్రభుత్వ విదేశాంగశాఖ కార్యాలయానికి వెళ్లి ఎర్నెస్టుబెవిన్ తో సంప్రతించాడు. అనేక విషయాలపై వీరు చర్చించినట్లు తెలుస్తున్నది. బెవిన్ వచ్చేవారం కొలంబోలో జరిగే కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశానికి ప్రయాణమవుతాడు.

# అట్లాంటిక్ రాజ్యాల ఆర్థిక సహకారం

## పారిస్ లో ఆర్థిక మంత్రుల సమాలోచన

పారిస్, డిశంబర్ 19: అట్లాంటిక్ రక్షణ ఒడంబడికకు చెందిన 12 రాజ్యాల ఆర్థిక మంత్రులు, వారి డిప్యూటీలు నేడిక్కడ సమావేశమైనారు. సమావేశం ఫ్రెంచి ఆర్థిక మంత్రి కార్యాలయంలో జరిగింది. యీ 12 రాజ్యాలలో ఏడు రాజ్యాల ఆర్థిక మంత్రులు, 5 గురు రాయబారులు లేదా వున్నతశ్రేణికి చెందిన రాజ్యాంగ తంత్రజ్ఞులు యిందు పాల్గొన్నారు. సైనిక సహకారానికి భంగంలేని రీతిగా, అట్లాంటిక్ రాజ్యాల పరస్పర ఆర్థిక సహకారానికి ఒక ప్రాతిపదిక కనిపెట్టుటే ఈ సమావేశంయొక్క ముఖ్యోద్దేశ్యం.

సైనిక సహాయం పొందుతున్న దేశాలకు, అమెరికా పంపే సైనిక ప్రతినిధి వర్గాలసంఖ్య, 80 నుండి 20, లేక 30 కి తగ్గించాలని యిందువల్ల సోవియట్ రష్యా తీవ్రవిమర్శనతొలగించుకొనను, వ్యయం తగ్గించుటకు వీలగునని, నార్వే డెన్మార్కులు చేసిన సూచనను అమెరికా ఆమోదించినట్లు తెలియవచ్చింది.

# బావ్ దాయ్ కు రాజ్యాధికార ప్రదానం

## డిసెంబరు 30-న జరుగగలదట

సైగాన్, డిసెంబరు 19: రాబోయే డిసెంబరు 30 వ తేదీని వియత్నామ్ ప్రభుత్వాధ్యక్షుడు బావ్ దాయ్ ఫ్రెంచి ఇండో చైనా ప్రభుత్వాధికారాన్ని స్వీకరింపగలరని తెలుస్తున్నది. వియత్నామ్ ఈశాన్యపు సరిహద్దులలో కమ్యూనిస్టు సేనలు సమీకరించ బడుతున్నవని తెలుస్తున్నది.

వియత్నామ్ ఫ్రెంచి సంయుక్త సంఘము ఈ అధికార ప్రదానం జరగగలదని ప్రకటించింది. ఈ అధికార ప్రదానానికి సంబంధించిన ఏర్పాటులు మార్చి 8 వ తేదీని జరిగిన ఒడంబడికను అనుసరించి చేస్తున్నారట. ఈ ఒడంబడిక ప్రకారము ఫ్రెంచి యూనియనులో వియత్నామునకు స్వాతంత్ర్యం ఇస్తూ ఫ్రెంచి ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది.

వియత్నామ్ ఫ్రెంచి సంఘంలో అభిప్రాయ భేదాలు వచ్చిన మాట అబద్ధమని ఈ సంఘ కార్యదర్శి ప్రకటించాడు.

జాతీయ చైనా సేనలను తరుముకొని వస్తున్న వేలకొలది చైనా కమ్యూనిస్టులు ఇండో చైనా సరిహద్దులలోకి వచ్చారని తెలుస్తున్నది.

2 వేల జాతీయ చైనా సైనికులు, ఇండో చైనాలోకి వచ్చారనీ, వీరిని నిరాయుధులను చెయ్యడం జరిగిందనీ, ఒక ఫ్రెంచి వార్తా సంస్థ ప్రకటించింది

ఫ్రాన్సు ఈ వేళ 6 వందల విదేశ సైనికులను ఆల్జీరియా నుంచి ఇండోచైనాకు పంపించిందని తెలుస్తున్నది.

# ఇండియాకు రమ్మని బెవిన్ కు ఆహ్వానం

లండన్, డిశంబర్ 19: కొలంబోలో కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశంలో పాల్గొని తిరిగి వెళ్లేటప్పుడు, భారతదేశానికి రావలసిందిగా, బ్రిటిషు విదేశాంగ మంత్రి బెవిన్ కు కామన్వెల్తు సంబంధాలశాఖా కార్యదర్శి ఫిలిప్ నోయల్ బేకర్ రాను భారతప్రభుత్వం ఆహ్వానం పంపినట్లు నేడిక్కడ తెలియవచ్చింది.

భారత ప్రభుత్వం తరఫున యీ ఆహ్వానాన్ని హైకమీషనర్ వి. కె. కృష్ణమీనన్ బ్రిటిషు మంత్రి కిద్దరకు అందచేశాడట.

## వి. కె. కృష్ణమీనన్ స్వదేశ ప్రయాణం

లండన్, డిశంబర్ 19: లండన్ లోని భారత హైకమిషనర్ వి. కె. కృష్ణమీనన్ గారు కొన్ని రోజులలో భారత దేశానికి ప్రయాణం కానున్నట్లు తెలుస్తున్నది తేదీ నిర్ణయం కాలేదు. ఈ వారాంతాన ప్రయాణం కావచ్చు.

## కొలంబో సమావేశానికి బర్మాను ఆహ్వానింపలేదు

లండన్, డిసెంబర్ 19: కొలంబోలో జరుగు కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశానికి, బర్మాను ఆహ్వానించుటను గూర్చి ఇదమిత్థముకాని అభిప్రాయం ఒక టిప్రబలంగా ఉన్నది.

బర్మావిదేశాంగ మంత్రి యెటువంటి అనుమానంలేకుండా ఈవిషయాన్ని వెల్లడిచేశాను. ఆ ప్రకటన అతిస్పష్టంగా వుంది. ఇప్పుడు దానిని వ్యాఖ్యానించడం అంటూ వచ్చేపటికి అధికారవర్గాలవారు దానిని కాదననూ లేకపోతున్నారు. ఔననిఅన లేకపోతున్నారు.

అదీ కాకుండా కామన్వెల్తులో సభ్యత్వం లేని బర్మా, కామన్వెల్తు రాజ్యాల మధ్య జరుగుతున్న ఈసమావేశానికి హాజరౌతుందన్నవార్త ఇచ్చటి అభిజ్ఞవర్గాలకు గాని, అధికారవర్గాలకు గాని, అంత రుచికరంగా లేదు.

## బర్మాప్రధాని: కొలంబో సమావేశం

కొలంబో, డిసెంబర్ 20: జనవరిలో ఇక్కడ జరగబోతున్న కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశానికి రమ్మని ప్రధాని థాకిన్ నూ ఆహ్వానింప బడినదీ, లేనిదీ తనకు తెలియదని సింహళ విదేశాంగ కార్యాలయానికి చెందిన ఒక ఉద్యోగి నేడిక్కడ ప్రకటించాడు.

## ఉద్యోగ వార్తలు

మదరాసు, డిసెంబరు 20: సూపర్ వైజర్లు శ్రీ సి. ఆర్. మురుగా చలం, జనాబ్ యం. రఫీక్ అహమ్మద్, ఆర్. లక్ష్మీపతిరాజు, కె వీరస్వామి తాత్కాలికముగా అసిస్టెంటు ఇంజనీర్లుగా నియమించబడిరి.

యుద్ధము నుంచివచ్చిన శ్రీ కె యస్. రంగస్వామి, కె ఆర్. రామస్వామి, శ్రీ పి. జి. జాన్ గార్లు నేరుగా అసిస్టెంటు ఇంజనీర్లుగా నియమించబడిరి.

# దక్షిణాఫ్రికా రౌండ్ టేబుల్ సమావేశం

## పాకిస్తాన్ భారతదేశాన్ని బలపరుస్తుంది

కరాచీ, డిశంబరు 19: దక్షిణాఫ్రికా సమావేశంలో పాకిస్తాన్ భారతదేశాన్ని బలపరుస్తుందని ప్రభుత్వ వర్గాలతో సన్నిహిత సంబంధంవున్న యిక్కడి రాజకీయ వర్గాలవారి వల్ల తెలుస్తున్నది

అయితే యిందువల్ల వాణిజ్య విషయం కంగా పాకిస్తాన్ కొన్ని ఆర్థిక యిబ్బందులను ఎదుర్కొనవలసివస్తుందనికూడా అంటున్నారు. చలామణీ విషయంలో భారత పాకిస్తాన్ ప్రభుత్వాలమధ్య వచ్చిన వివాదం కారణంగా, పాకిస్తాన్ వెంటనే దక్షిణాఫ్రికాతో ఒక వాణిజ్య ఒడంబడిక చేసుకోవలసిన అవసరం వున్నదట.

# ఇండియన్ బ్యాంకు లాహోరు శాఖ

## పాకిస్తాన్ అధికారుల దుశ్చర్య

న్యూఢిల్లీ, డిశంబర్ 19: లాహోరులో పనిచేస్తున్న ఒక ఇండియన్ బ్యాంకును పాకిస్తాన్ అధికారులు ఎటువంటి నోటీసు లేకుండా, దాని కార్యాలయంలోంచి బయటికి నెట్టారు.

'ఆ బ్యాంకువున్న భవనాలు తమకు కావాలని నోటీసు ఇవ్వడంగాని, ఆట్లా నోటీసు ఇవ్వలేదు కాబట్టి వేరేస్థలం చూపెట్టడంగాని పాకిస్తాన్ ప్రభుత్వం చేయకుండా వారిని బయటికి గెంటిందని భారత ప్రభుత్వానికి వర్తమానం చేరింది.

1949 ఏప్రిల్ లో చేసుకున్న బ్యాంకింగ్ ఒడంబడికకు ఇది పూర్తిగా విరుద్ధం.

అందువల్ల ఇండియా ప్రభుత్వం పాకిస్తాన్ కు తన అభిశ్రేపణను తెలియజేస్తూ, బ్యాంకులలో పనిచేస్తున్న వాళ్ళ నందరిని కాంపిటీకులను చెయ్యాలనే ఉద్దేశంతోనే ఇట్లా ఆ దేశం ప్రవర్తించిందని ఇండియా అభిశంసించింది.

# ఇండొనీషియా

## ప్రథమ మంత్రివర్గం

బటేవియా, డిసెంబర్ 20: కొత్తగా నెలకొల్పబడుతున్న సంయుక్త ఇండోనీషియా ప్రథమ మంత్రివర్గాన్ని జోగ్జకర్తా రేడియో నేడు ప్రకటించింది. డా॥ హట్టా ప్రధానిగాను, తాత్కాలిక విదేశాంగ మంత్రిగాను నియమించబడ్డాడు. తూర్పు ఇండోనీషియా ప్రధాని అనక్ అగుంగ్ హోం మంత్రిగాను, జోగ్జకర్తా సుల్తాన్ హమేంకు బువోనో, దేశ భద్రతల శాఖ మంత్రిగాను నియమితులైనారని జోగ్జకర్తా రేడియో వెల్లడించింది.

మిగిలిన శాఖలు ఈ క్రిందవారికి ఇవ్వబడినవి.

ద్రవ్య శాఖ: వ్రషిద్దీన్ ప్రవీర్ నగరో.

ఆర్థికశాఖ: డా॥ డి. వాండా

ఆరోగ్య శాఖ: డా॥ లైమెనా

రహదార్లు, పబ్లిక్ వర్క్సు: డా॥ ఇరిర్ లాహో

కార్మిక శాఖ: విలోపో

ప్రజాక్షేమ శాఖ: కోసవీ

ప్రచార శాఖ: ఆర్నాల్డ్ మానోనటుట్.

విద్య: డా॥ బూహానీప్రా.

మతవ్యవహారాలు: వహీద్ హషీం.

న్యాయశాఖ: డా॥ సుపోమో

శాఖ ప్రత్యేకించని మంత్రులు: సుల్తాన్ హమీద్, డా॥ మహమద్ రుం, సుపర్మో.

ఈ 16 మందిలోనూ 10 మంది రిపబ్లికన్లలో, 6 మంది ఫెడరలిస్టులు ఉన్నారు. ఈ నియామకంలో కేవలం శక్తి సామర్థ్యాలే పరిగణించబడినవి కాని రాజకీయ సంబంధాలుకూడా లేదని జోగ్జకర్తా రేడియో ప్రకటించింది.

# హిట్లరుసేనాని మాన్ స్టిన్ కు 18 ఏళ్ళ కారాగారశిక్ష

హాంబర్గ్, డిశంబర్ 19: పోలండ్ లోనూ, రష్యాలోనూ, హిట్లరుకు ప్రధాన సేనానిగా పనిచేసి అనేక యుద్ధనేరాలకు కారకుడైన ఫీల్డ్ మార్షల్ ఎరిక్ వాన్ మాన్ స్టిన్ కు ఈవేళ ఇక్కడి బ్రిటిష్ మిలిటరీ న్యాయస్థానంవారు 18 సంవత్సరాల కారాగారం విధించారు.

శిక్ష చెప్పటంతోనే, నెరసిన వెల్ల తల కట్టుతో కన్పు పరిగా కనపించిన ఆయన ముఖం జేవురించిపోయింది. పోలీసువారు వచ్చి ఆతనిని తీసుకుపోయేవరకూ అలానే నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

మాన్ స్టిన్ యింతవరకూ అనుభవించిన జైలు శిక్షనుంచి తగ్గించుతారు.

# ఆర్యవైశ్య మహాసభ 24-వ సమావేశము

## జనవరిలో చెన్నపట్నంలో జరుగుతుంది

ఆర్యవైశ్య మహాసభవారి 24-వ సమావేశము 1950 జనవరి 1, 2 తేదులను మద్రాసులో జరుగును. ఈ సమావేశమునకు జార్జిటౌనులో హైకోర్టుకు ఎదురుగా పూర్వపు మద్రాసు క్రిష్టియను కాలేజికి చెందియుండిన ఆండర్సన్ హాలు ఏర్పరుపబడియున్నది. శ్రీ కర్లపాటి అప్పారావు గారు ప్రతినిధులు అందరికి భోజనవసతులు ఏర్పరిచి ఆతిథ్యమిచ్చుటకు ఉత్సాహపూర్వకముగ అంగీకరించిరి.

దేవస్థానములు, సత్రములు, సంతర్పణములు, విద్యానిధులు, వ్యాయామసంస్థలు, మొదలగు ప్రత్యేక కార్యములకు ఏర్పడినట్టిగాని సాధారణ సంఘోద్ధరణకు ఏర్పడినట్టిగాని, ప్రతి ఆర్యవైశ్యసంస్థయు ఈ సమావేశమునకు ప్రతినిధులను పంపవచ్చును. స్త్రీలు, పురుషులు, యువకులు, వృద్ధులు, పండితులు, పామరులు, వణిజులు, వ్యవసాయదార్లు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, ఉద్యోగులు, న్యాయవాదులు, వైద్యులు, మొదలగు ఆర్యవైశ్యులు ఎల్లరు ఈ సమావేశమందు పాల్గొనవచ్చును. ఎవరికి తోచిన తీర్మానములను వారు పంపవచ్చును. అవి అన్నియు విషయ నిర్ధారణ సభయందు చర్చించబడును. ఆని ఆహ్వాన సంఘాధ్యక్షుడు బచ్చు పాపయ్యశెట్టిగారు, ఆహ్వాన సభ గౌరవ కార్యదర్శులు కే. వి స్వామి, సి. ఆదిశేషు గార్లు వ్రాయుచున్నారు.

### తిరుప్పావై ఉపన్యాసములు

మదరాసులో మింటుస్ట్రీటునందలి 407 నెం. యన్. యతిరాజులుశ్రేష్ఠి చారిటీ భవనం కాలక్షేపహాలులో ధనుర్మాసాంతము 13-1-50 తేదీవరకు ప్రతిదినము ఉదయమున గం 7-30 (ముక్కోటి నాడు మాత్రము సా. గం 8) తిరుప్పావై కాలక్షేపము తెలుగులో ఉపన్యాసరూపముగ శ్రీమాన్ పండిత చక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులవారిచే జరుపబడుచుండును. భక్తజనులందరు విచ్చేసి వినుచుండ ప్రార్థితులు అని పై చారిటీ ట్రస్టీలు వ్రాసిరి

### వెంకటగిరి జమీనురైతులు

వెంకటగిరితాలూకా జమీను రైతు సంఘం తరఫున కే. ఎల్. నారాయణరావు, పి. వెంకటస్వామిరెడ్డి కె వెంకటసుబ్బారెడ్డి జి. నారాయణరెడ్డి, ఎన్ సిద్ధయనాయుడు, పి. సుబ్బరామయ్య, పి. రామకృష్ణయ్యగార్లు రివెన్యూమంత్రి సీతారామరెడ్డిగారి కద్దకు రాయబారం వెళ్లి, కిస్తుతగ్గింపు చట్టంప్రకారం సెటిల్మెంటు అఫీసర్లు నిర్ణయిస్తున్న చర్యరైతులకనుకూలంగా లేదనియు, ఆఫీసర్లకు వీలు లేదన్నదనియు, కంచలు పసువుమేత హక్కులగూర్చియూ దీర్ఘ విన్నపములు దాఖలు చేసుకొనిరి మంత్రిగారు శ్రద్ధగ విని తగు శ్రద్ధ గైకొందుమనిరి.

### శ్రీ ఎన్. వి. గాడ్గిల్

కేంద్రప్రభుత్వ పబ్లిక్ వర్క్సు మంత్రి ఎన్. వి. గాడ్గిల్ గారు డిసెంబరు 28 సాయంత్రం మద్రాసువచ్చి 29 సాయంత్రం గిండీ ఇంజనీరింగ్ కాలేజి ప్రదర్శనము ప్రారంభింతురు.

### శ్రీ సీతారామ రెడ్డి పర్యటన

రెవిన్యూశాఖా మాత్యులు హోలాహరి సీతారామరెడ్డిగారు 25 ఉదయం మద్రాసులో బయలుదేరి సాయంత్రానికి మైసూరు చేరెదరు. 26 నుంచి 29 వరకు కార్మికమంత్రుల సమావేశంలో పాల్గొందురు. 30 న హనుమాన్ విమానంలో మద్రాసుమీదుగా విశాఖపట్నం చేరుదురు. 31 న ప్యాసెంజరులో చామర్లకోట చేరెదరు. కాకినాడ చూచుకొని 1 వ తేదీకి మద్రాసు వచ్చెదరు.

### సింప్సన్ కంపెనీ తగాదా

చెన్నపట్నం, డిశంబరు 20: మదరాసు నందలి సింప్సన్ కంపెనీలిమిటెడ్ జార్జి ఓక్సు లిమిటెడ్ అసోసియేటెడ్ ప్రింటర్సు పరివారలకు యజమానుల మధ్య 1949 సం॥ దీపావళి కివ్వవలసిన 3 నెలల బోనస్ జీతాల పెంపకం మున్నగు విషయాలలో కలిగిన తగాదాను పరిష్కరించే బాధ్యత మదరాసు ఇండస్ట్రియల్ ట్రిబ్యునలుకు ఒప్పచెప్పబడినది.

### విజయరాయి పంచాయతీ బోర్డు ఎన్నికలు

విజయరాయి (దెందులూరు ఫిర్కా), డిసెంబరు 18: ఈ గ్రామపంచాయతీ బోర్డు ఎన్నికలు మొన్న జరిగినవి. 8 సీట్లకు 16 మంది పోటీ చేసిరి. ఈ క్రిందివారు ఎన్నిక అయిరి: ప్రతివాది భయంకర అప్పన్ సైనారాచార్యులు, యర్రంశెట్టి గంగారావు, పజ్జా క్రిష్ణయ్య, కోట వెంకటయ్య (హరిజన), ప్రతివాది భయంకర పురుషోత్తమ శ్రీరంగాచార్యులు, మొరుపోయిన రాఘవులు, దొడ్డి అప్పలస్వామి, మడా సోమయ్యగార్లు.

# చిత్తూరుజిల్లా గురించి తమిళుల ప్రచారం

## నెడియం పంచాయతీ బోర్డు నిరసన

నగిరి, డిసెంబరు 16: నెడియం గ్రామ పంచాయతీబోర్డువారు మొన్న అధ్యక్షుడు చె. గోవిందస్వామి రెడ్డిగారి అధ్యక్షతను సమావేశమై ఈ దిగువ తీర్మానము చేశారు. "ఆంధ్రుల చిరకాల వాంఛితమైన ఆంధ్రరాష్ట్రమును ఇండియా రిపబ్లిక్ అవతరణ పుణ్యకాలమైన జనవరి 26 వ తారీఖుననే నిర్మాణము చేయవలయుననీ, ఆంధ్రరాష్ట్రములో చేరియున్న చిత్తూరు మండలమందలి, తిరుత్తని పుత్తూరు తాలూకాలను కొందరు అరవ లూకా తమిళ సోదరులు తమిళరాష్ట్రములో చేర్చవలయునని చేసే వింత ప్రచారము నకు నిరసన తెలుపుతూ, నూటికి 95 మందికిపైగా ఆంధ్రులుగల చిత్తూరుమండలమును సంపూర్తిగా ఆంధ్రరాష్ట్రములోనే చేర్చవలయునని ప్రభుత్వమును కోరడమైనది." (స్వ. వి)

# ఆంధ్రరాష్ట్రాన్ని ఎదుర్కొనే సమస్యలు

## నాయకుల సమావేశావశ్యకత

### మల్లెల - శ్రీరామమూర్తిగారి సూచన

విజయవాడ, డిసెంబరు 19: శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు ఇట్లు వ్రాసిరి: ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమును ఎదుర్కొనే వివిధ సమస్యల పరిష్కారమునకు ఆంధ్రనాయకుల సమావేశం జరగాలని రాయలసీమ ప్రముఖుడు కల్లూరి-సుబ్బారావుగారు నేటి 'ఆంధ్రపత్రిక'లో చేసిన ప్రకటన ఉత్తమమైనది. మనము రాయలసీమ, సర్కారు సీమ అను భిన్న భావములు మరచిపోయి, అందరమూ కలసి పని చేయవలసిన సమయము వచ్చినది.

శ్రీ బాగు ఒడంబడికలో "హైకోర్టు, ముఖ్యనగరమును, కోస్తా జిల్లాలలోను, రాయలసీమలోను ఉచిత ప్రదేశములలో నుండవలెననియు, ఇందులో ఏది తమకు కావలెనో రాయలసీమవారే కోరుకొనవలెననియు" వ్రాసుకొని యున్నాము. ఈ ఒడంబడికను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము, ఆంధ్రమహాసభ అంగీకరించినవి. ఆ ఒడంబడికను అమలు జరుపవలెనని మన నాయకులందరూ కోరుచున్నారు.

ఈ స్థితిలో కాలహరణము కాకుండ సుబ్బారావుగారు సూచించినట్లు ఆంధ్రనాయకుల సమావేశము తక్షణము జరుగుటావశ్యకము. ఇట్టి సమావేశమును ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీయైననూ పిలువవచ్చును. లేదా రాయలసీమ వారైననూ ఆహ్వానించవచ్చును. గనుక నాయకులు ఆలోచించి అట్టి సమావేశమును త్వరగా ఏర్పాటుచేసి భవిష్యత్కార్యక్రమును నిర్ణయించుకొని, ఏకాభిప్రాయముతో ఆంధ్రైక్యతను ప్రదర్శింతురనీ, సమస్యలను పరిష్కరింతురనీ ఆశించుచున్నాను.

# మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 21:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవరను 1-కి ఎవ్వర్డు బొంబాయి సేల్సుటాక్సుతో సహా రు. 76 10-0 పెట్లా బంగారు తులం 115-8-0 మాపబంగారు 118-12-0 సీమవెండి తులం 100-8 (రెడీ 173-8-0 వెండి తులం 1-8 1-12 0

వేరుసెనగ: (531 కా 1-కి ఎన్ను కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది రు. 166-8-0 (కోరమాండల్)

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (వివరేజి) రు. 337, 338విలో 8% యఫ్. యఫ్. ఎ. సెంటుకాయనూనె (87 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వాలిస్. రు. 37-12-9 38-12-9

ఆముదం

కాండి 500 సౌనుగలది రు. 250 268
(ఒంగోల్, నరసరావుపేట)రు. 270 275

పంచదార

| | | |
|---|---|---|
| హాపర్‌ఫ్లూర్ | ,, | రు. 96-14-0 |
| మోతీఫ్లూర్ | ,, | రు. 94-7-10 |

# న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 20:

మార్చి 30 56/30 66 కి 30.84/30.85 జూలై 29.73/29.75 అక్టోబర్ 28.81/28.82 డిసెంబరు 28.20 విజ్ 28 22 అన్ట్రేడ్ మార్చి 28.10/ బిడ్ 28.13 అన్ట్రేడ్ మే 28.03 విజ్ 28.06 ట్రేడ్.

| | | |
|---|---|---|
| ఓపెనింగ్ | పోజరు | 31 22 |
| మార్చి | (గరిష్ఠధర) | 30.59 |
| | (కనిష్ఠధర) | 30.45 |

# పంచాయతీ బిల్లు

## మద్రాసు అసెంబ్లీలో చర్చ

మదరాసు, డిసెంబరు 20: మదరాసు అసెంబ్లీ నేడు సమావేశమైనప్పుడు మదరాసు పంచాయతీల బిల్లుపై చర్చ జరిగెను. డిప్యూటీ స్పీకరు శ్రీమతి అమ్మన్న రాజాగారు అధ్యక్షత వహించిరి.

శ్రీ జి. సబ్బాసిరావుగారు మాట్లాడుచు ఫిర్కా డెవలప్‌మెంటు శాఖను ఎత్తివేసి దాని విధులను పంచాయతీలకే వప్పగించవలెననిరి. లైబ్రరీలను కూడా పంచాయతీల పరము చేయవలెను. నిషేధిత స్థలములను పంచాయతీ క్రిందవుంచి గ్రామ మొత్తమునకు వినియోగపరచవలెనని పంచాయతీ బిల్లును సమర్థించిరి.

హైద్రాస్ గారు పంచాయతీలకే అధ్యక్షులను ఎన్నుకొను అధికారము ఉండవలెననిరి. బిల్లును బలపరచిరి.

శ్రీ చిదంబర అయ్యరుగారు పంచాయతీబిల్లుతో గ్రామాల్లో నిజమైన స్వరాజ్యము రాగలదనియు, ప్రజలు అధికముగా నిరక్షరులై ఉన్నప్పుడు ప్రజలే అధ్యక్షుని ఎన్నుకొను అధికారం అంతమేలుగాదేమోననిరి. శ్రీ పెరియస్వామి గారు బిల్లును బలపరచుచూ మాట్లాడిరి.

రజాఖాన్‌గారు బిల్లును తెచ్చుటలో మంత్రిగారు ప్రదర్శించుచున్న ఆత్రమును, చిత్తశుద్ధిని ప్రశంసించిరి. గ్రామాలలో ఉన్న కలతలనుబట్టి ఇప్పుడు ఇట్టి బిల్లు తెచ్చుట ఎంత ప్రయోజనము ఉన్నదికి ఉదమూ పంచాయతీ ఏర్పరచి పాయంత్రము రద్దుచేయుటకా? అని అడిగిరి. ఈ నాటికైన హరిజనులకు ప్రత్యేకస్థానములు కేటాయించ చేయలేకపోవుట శోచనీయము. కులమత విభేదములు కొల్లలుగా ఉన్న గ్రామాలలో ప్రత్యక్ష అధ్యక్షఎన్నిక తగాదాలు గ్రామాలను ఛిన్నాభిన్నము చేయుగలవు. రాష్ట్రము ఎన్నికలకి విభజనగానున్నదో ఇంకనూ తెలియదు. మా జిల్లాలో 80 బిల్లులు ఆమోదించినామనుచున్నారు. బిల్లులు ఎన్ని ఆమోదించారన్న ప్రచారముతో ప్రజలు దాసానుదాసులుగాగు. వారి సౌభాగ్యమెంత కల్గినది? అన్న దానిపై ఆధారపడి ఉండుననిరి.

మజీద్ గారు బిల్లును తెచ్చుటకిది సమయము గాదనిరి. మునగాల పట్టాభి సీతారామయ్య గోవిందమీనన్ గారలు బిల్లును బలపరచుచూ మాట్లాడిరి.

పరీసా హేబుగారు సామాన్యజనులకు విద్యావంతులుగా చేయుటకు పంచాయితీలు సహాయ్యపడితే ప్రయోజనం ఉండదనిరి.

శ్రీ వేలుస్వామి గౌండర్ గారు పంచాయితీలకు విశేషముగా రివిన్యూ లభింపచేయకపోతే వాటి పరిపాలన అదర్శముగా సాగదనిరి. పంచాయితీలందు స్త్రీలకు తగు రీతిని ప్రాతినిధ్య మివ్వవలెననిరి.

మహ్మద్ సామ్నాడ్ గారు పంచాయితీలమీద ఇన్‌స్పెక్టరుకు విశేషాధికారములు యియుండుట తగదనిరి.

శ్రీ పైడా వెంకటనారాయణగారు బిల్లును బలపరచిరి. పంచాయితీలకు పరిపాలనా విషయములందు సర్వస్వాతంత్ర్య ముండేలాగున వలయు సవరణలు బిల్లులో చేయవలెననిరి.

శ్రీమతి లక్ష్మీశంకరయ్యర్ గారు తమిళములో బిల్లు బలపరచిరి.

అంతటితో సభ మధ్యాహ్నమునకు వాయిదా పడెను.

అసెంబ్లీ సభ మధ్యాహ్నం ఫలహారానంతరం సమావేశము కాగా శ్రీమతి లక్ష్మీ శంకరయ్యర్ గారు ప్రసంగము సాగిస్తూ పంచాయితీల పరిపాలనమునొప్పనముగా సాగటానికి వాటి ఆర్థిక స్థితిని సర్వమార్గములలో బలపరుచుటకు యత్నించుట అవశ్యక మనిరి.

శ్రీ నవ్వాడ రామచంద్ర రావుగారు ప్రజలకు స్వయంపరిపాలనా పద్ధతులలో, శిక్షణ యొసగుటకు యీపంచాయతీల బిల్లుచాలా ఉపయుక్తముగా నుండును గాన బిల్లును కాను సంతోష పూర్వకముగా బలపరుచుచున్నట్టు నుడివిరి.

శ్రీ కోటిరెడ్డిగారు గ్రామాలలో యిది వరకే కక్షలుంటున్న వనియు యీ పంచాయతీల ఎన్నికల మూలమున పార్టీల సంఖ్య యింకా ఎక్కువ కాకుండునట్లు చేయుట జరిగితేనే బిల్లువల్ల కొంత ప్రయోజన ముండవచ్చుననిరి. గ్రామ పంచాయతీలలో పంచాయతీదార్లు గ్రామ ప్రజలందరి ఓట్లు బడసి వారి విశ్వాసమునకు పాత్రులై యుండుట మంచిదిగాని పంచాయతీలను వార్డులుగా విభజించి వాటికి ప్రతినిధులంటే ఏర్పాటు తగదనిరి. పంచాయతీల ఎన్నికలు రహస్య బాలెటు పద్ధతిలో జరుగవలెనని సూచించిరి.

అన్వర్ సాహేబుగారు ప్రపంచములో ప్రతిచోట సర్వాధికారము కేంద్రీకరించవలెననే ప్రయత్నములు జరుగుచుండగా మనరాజధానిలో యీ బిల్లుమూలమున అధికారవికేంద్రీకరణమేల జరుగవలెనో దురూహ్యముగానున్నదని బిల్లును ఎదిరించిరి. పంచాయితీలవల్ల గ్రామములకు కీడుగూడునుగాని కాంతిగాని మేలుగాని చేకూరజాలదనిరి. రాష్ట్రానికపరాలను కావలసినంత ధనము ప్రభుత్వమునకు యియ్యకుండునని సందేహమున్నపుడు ఈపంచాయితీల నిర్వహణకు కావలసినడబ్బు ఎక్కడనుండి వచ్చుననిరి.

నూత్న రాజ్యాంగముక్రింద రాష్ట్రశాసనసభలే ఒకపంచాయితీబోర్డులో గుల్ల ముకాగలదు. రాష్ట్రీయ ఆర్థికస్థితి కూన్యములై రాష్ట్ర ఆర్థికశాఖామంత్రి పాపరు కాగలరు. కేంద్రప్రభుత్వమే ఆర్థికాదాయ వన్నరులను తమహస్తములలో తీసుకొనుటవల్ల యీ పరిస్థితి ఏర్పడును. ప్రభుత్వంవారి పంచాయితీవిధానము దుష్టమైనది. విచారకరమైనది. చంచలమైనదనిరి. పెయిస్‌గారు బిల్లును బలపరచిరి.

బద్దెపూడి వెంకటనారాయణ రెడ్డిగారు, చట్టమును బలపరచుచు, కరణమునస్సులకు అధికారాలు పంచాయతీబోర్డులకు యిచ్చునపుడు రివిన్యూ డివిజనలు ఆఫీసరు, లేక తాసీల్దారుల అనుమతిపై జరుగవలెను. యాలిగాని లోకలుబోర్డు ఇన్‌స్పెక్టరు అనుమతిపై జరుగుట మంచిదనిరి. కాలహరణం లేకుండా పని జరిగేటట్లు చేయాలి. వెంటనే జరగవలసిన కార్యాలకు ఇనస్పెక్టరు ఉత్తరువువచ్చుట ఆలస్యమగును కనుక ఆర్. డి. ఒ. అనుమతి ఉంటే చాలునని నిర్ణయించుట మంచిది. కంట్రోలు వస్తువులు పంచేఅధికారం పంచాయతీలకుయివ్వాలి.

కె. లింగరాజుగారు, యీ చట్టమును ప్రభుత్వంవారు కడు ధైర్యంతో చేసినందుకు అభినందించిరి. 500 జనసంఖ్యగల గ్రామంలోకూడ పంచాయతీ స్థాపించుట కష్టం. 1000 కనీసంగా నుండవలెను. కరణానికి, మునసబుకి వ్యక్తిత్వంచూపుట తగవులు పెరుగుటకు కారణమగును. కనుక పంచాయతీలో చేరుస్తే యిద్దరిని చేర్చాలి. లేదా యిద్దరిని తొలగించాలి గ్రామాధ్యక్షుని ప్రజలే ఎన్నుకోవాలనుటచే ఆతను నిరంకుశాధికారియగును. సభ్యులు సూచించిన సవరణలను మంత్రిగారంగీకరించి లొటులు తొలగించాలనిరి.

చిన్న ఖాదిను, చట్టం మూడు నెలలలో అమలుజరపాలని కోరిరి.

టి. వెం. రామస్వామిగారు, గాంధిగారి కలలన్నియూ నేడు నిజమయిననిరి. ప్రకాశంగారు ఊహించిన పంచాయతీ రాజ్యానికి యీచట్టం దారితీయుచున్నది. గ్రామమునకు స్వపరిపాలనాధికారం ఇవ్వందే దేశంలో స్వరాజ్యం నిర్వహించుటకు ప్రజలకు సమర్థతయుండదు స్త్రీలు ప్రత్యేకనియోజకవర్గము లక్కరలేదన్నది నగరాలకు వర్తించును. కాని గ్రామములందు స్త్రీలకు కొన్ని స్థానములు ప్రత్యేకించుట అవసరము. గ్రామాధ్యక్షుని పంచాయతీ సభ్యులే కాక, గ్రామస్థులంతా ఎన్నుకొనుట ప్రస్తుతానికి మంచిదే, లోపాలుంటే తర్వాత సవరించుకోవచ్చుననిరి

ఆర్ ఎస్. మాణిక్యంగారు హరిజనులకు నామినేషను ద్వారా ప్రాతినిధ్యం ఉండక తప్పదనిరి. గ్రామంలో చాకిరీ చేసేది వారేననియు, వారు ఎన్నికలలో గెలుపొందరనియు చెప్పిరి.

నివర్తి వెంకటసుబ్బయ్యగారు యీ చట్టము గ్రామీణుల స్వతంత్ర పట్టావంటిదనిరి. బ్రిటిషువారివద్ద మనం గ్రహించిన అధికారం గ్రామస్థులకు బదిలీ చేయరాదని అన్వయకట్టే నగరవాసులనరచ్చు. కాని గ్రామములే ప్రజాజీవితములో ముఖ్యకేంద్రములని గమనించాలి మాతప రాజ్యాంగంలో 40 సెక్షనుకూడ గ్రామాలకు పంచాయతీలు స్థాపించి స్వాతంత్ర్యం ఇవ్వాలని గలదు. కనుక యిది పిచ్చచట్టమనరాదు. పంచాయతీలకు 12½% వంతు ఖర్చేగాక, యెక్కువ ప్రభుత్వ గ్రాంటు యిచ్చుట అవసరమనిరి.

అన్నామలై పిళ్ళై గారు, చట్టమును బలపరచిరి.

ఆర్. వి. స్వామినాథన్ గారు, నేడు మధ్యాహ్నం 1 గంటసేపు సభాధ్యక్షత వహించిరి.

బి. వెంకటసుబ్బయ్యగారు, గ్రామపంచాయతీ అధ్యక్షునిగ తమ అనుభవమును బట్టి యీచట్టం చాల జయప్రదంగా కొనసాగగలదని గ్రామాలలో తగవులు హత్యలు జరుగుతాయనీ భయపడ నవసరంలేదనియు, గ్రామస్థులు అక్షరజ్ఞానం లేకపోయినా లోకజ్ఞానం కలవారనియు చెప్పిరి. పొందూరులో గ్రామ పంచాయతీలకు సంస్థానము జనసంఖ్యనుబట్టి కలదు రూ 5 ఖర్చులకిచ్చుచుండెననియు, అట్లు యీ ప్రభుత్వంకూడ ఏర్పాటు చేయాలని సూచించిరి. పంచాయతీ అధ్యక్షుని ప్రజలంతా ఎన్నుకోడమే మంచిదనిరి.

డా॥ కామ్యాలు గ్రామాలలో తగవులున్నా వరదలువచ్చినపుడు అందరు కలసి చెరువు మరమ్మతు చేసిరనియు, యిటువంటి చట్టమువల్ల గ్రామాలు ఎన్నో విధముల బాగుపడగలవు. పంచాయతీలు లేకున్న గ్రామాలకు ఒకనూయికూడ యివ్వుడున్న జిల్లాబోర్డులవల్ల లభించుట లేదనియు చెప్పిరి. గ్రామస్థులందరు ఎన్నుకొంటే మంచి అధ్యక్షులు లభించగలరనిరి.

షేక్ ఉడ్డీనుగారు, యిప్పుడు గ్రామాలలో పంచాయతీలు లేకపోలేదనియు, వాటికి యీ చట్టంలోని వాటికి ఎన్నిక విధానమునందే భేదంగలదు. పంచాయతీలకు కొంచెం ఎక్కువ సౌకర్యాలు యిచ్చిరి. అంతేగాని లో. బో. ఇనస్పెక్టరుల అధికారాలు తగ్గలేదు. గ్రామ తగవులకు రాబడిలేదు. 1920 చట్టానికి దీనికి అట్టే భేదమేలేదు. అధ్యక్షుని అధికారంలో ఏమి మార్పులేదు. ప్రజలెన్నుకున్న గ్రామాధ్యక్షుడు పంచాయతీ సభ్యులు వికేంద్రీకరించక పోయినచో ఏమగుననిరి

ఎస్. ఎస్. వరదాచారిగారు, పంచాయతీలందు పార్టీలబాధ యుండదనిరి. ప్రతిగ్రామానికి ఒక పంచాయతీ ఉండక, పెద్ద గ్రామాలకే యుండిన బాగుండును. అనేక పంచాయతీలు బలహీనంగా నుండును. భూమిశిస్తులో 12½% వంతు ప్రభుత్వం యిచ్చినా పంటలు పోయినపుడా రాబడి పంచాయితీకి ఉండనేరదు. ఇతర విషయములకు రాబడికూడ చాలదు. కనుక చిన్న గ్రామాలకుకూడ పంచాయతీలు ఏర్పరచుట ఉపయోగకరముండదనిరి.

విశ్వనాథంగారు, విశాఖపట్నం మునిసిపాలిటీకే నీటిసప్లయికి డబ్బుచాలక ప్రభుత్వానికిచేయిచాచుచున్నపుడు 300 రాబడిగల గ్రామపంచాయితీ ఒక నుయ్యేనా త్రవ్వించగలదా? కనుక ఎన్నికలకొరకు యీ చట్టం ఉపయోగపడునేమో గాని, గ్రామాలన్నింటికి ఉపయోగపడదనిరి. రక్తంలేని బలహీనం పంచాయతీ లుపయోగంలేదనిరి.

బి. ఎస్. మూర్తిగారు: గ్రామాలలో ఆస్తంతా ఒకరిద్దరు ధనికులకే యుండుననియు, వారు తక్కినవారిని పసువులుగా చూస్తారనియు, యీ చట్టం అట్టివారికి ఎక్కువ అధికారాలు యిచ్చుననియు నుడివిరి. అట్లుకాక పాటకపు జనానికి అధికారంయిచ్చే చట్టం ఉండాలనిరి. హరిజనులకు తగిన ప్రాతినిధ్యం లేదనిరి. హరిజనులకు యిప్పటికిని సాంఘిక బహిష్కారము హింసలు జరుగుచున్నవనిరి. పంచాయతీ రాజ్యం యింతమాత్రమున వచ్చిందనుకో రాదనిరి.

## మంత్రిగారి జవాబు

శ్రీ క. చంద్రమౌళిగారు, చర్చకు బదులు చెప్పుచు, కొందరు సభ్యులు తీవ్రంగా విమర్శించిరనియు, కాని వారి వాదమునకు యితరులు బదులుచెప్పిరనియు నుడివిరి. గ్రామాలగూర్చి పూర్తిగ తెలియక, పాశ్చాత్య నాగరిక వ్యామోహం కలవారు యీ చట్టాన్ని తీవ్రంగా విమర్శించిరి అన్వరుగారు వోస్టలుప్రదర్శింప పిచ్చిగా నుడివిరిగాని చట్టం పిచ్చగాలేదు గ్రామాలు ఎలాగు నడిపా డబ్బు ప్రధానమని రజాఖానుగారు వరదాచారిగారనిరి. నా జేబు ప్రధానం కాదు. గ్రామస్థులు స్వయంపోషకంగా శాంతంగా స్వపరిపాలన చేసుకొనుటకే యీ చట్టం ఉద్దేశించబడినది. బయటివారి జోక్యంలేకుండా చేయుటే ఉద్దేశం. ప్రజారాజ్యానికి ప్రధాన ప్రజలందరి ఓటు అధికారం అందుకే అధ్యక్షుని ప్రజలందరు ఎన్నుకోవాలంటిమి. మనదేశంలో రాజ్యపాలనకు గ్రామమే మూలముగనుండెను. గ్రామాలు మనం అశ్రద్ధచేయబట్టే, యిపుడు తిండికిచాలక కష్టపడుచున్నాము. గొప్పకోసం యీ చట్టం చేయుటలేదు. గ్రామసౌష్టవను చెడగొట్టరాదు. హరిజనులు కోరబట్టే వారికి ప్రత్యేక స్థానములు యేర్పాటు చేసితిమి. అది సంఘ ప్రత్యేకతలు గుర్తించికాదు. గ్రామస్థులకు ఓటు అధికారం యిచ్చినపుడు డబ్బునిబట్టి యివ్వలేదు. పేదవానికి గొప్పవానికిగూడ ఒకే ఓటు వుండును. కనుక బి. ఎస్. మూర్తిగారు భయపడనవసరంలేదు. అధ్యక్షుని గ్రామస్థులు అందరు ఎన్నుకోవాలనడం అల్పసంఖ్యవర్గాల శ్రేయముకొరకే అట్లా ఎన్నుకొనబడిన పంచాయతీ అధ్యక్షుడు సభ్యులకు భయపడనవసరంలేదు. అతనే కార్యనిర్వాహకోద్యోగిగ నుండును. పంచాయతీ సభ్యులు పాలసీ నిర్ణయించుచుందురు. ద్రవ్య పుదుర్వినియోగంజరిగినపుడే ఎక్జిక్యూటివు ఉద్యోగులను నియమింతుము. పంటలు పోయిన గ్రామపంచాయతీలకు పంటలనుబట్టిగాక, జనసంఖ్యనుబట్టి 12½% భూమిశిస్తు పంచిపెట్టెదము.

చట్టం ప్రథమ ప్రతిపాదన అంగీకరించబడెను.

# పుదుక్కోట సంస్థాన దావా త్రోసివేత

తిరుచునాపల్లి, డిశంబర్ 19: పుదుక్కోట సంస్థానాన్ని మద్రాసు రాష్ట్రంలో కలిపినందుకు గాను, పుదుక్కోట పౌరుడు ఒకాయన దాఖలుచేసిన దావాను త్రోసివేస్తూ, ఖర్చులు ముద్దాయి యిచ్చుకోవలసిందిగా తిరుచునాపల్లి జిల్లా జడ్జి తీర్పు చెప్పారు.

"విలీనీకరణ" అనేది ప్రభుత్వానికి సంబంధించిన కార్యకలాపం. దాన్ని విచారించే అర్హత యీ న్యాయస్థానాలకు లేకపైగా యీదావాకు సివిల్ స్వభావంలేదు అని తీర్పులో తెలియజేశారు.

'పుదుక్కోట ప్రభుత్వాధ్యక్షుడుగా యీవిలీనీకరణకు అంగీకరించాను. ప్రభుత్వం అనుసరించే విధానాలు పౌరులు అందరూ శిరసావహించవలసి వుంటుంది. ఈ నష్టనహానాలను న్యాయస్థానాలకు తేవటానికి యేపౌరుడికీ హక్కులేదు' అన్నారు,









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, G. T. Madras